



# విషయానుక్రమణిక

## చిత్రములు

త్రివర్ణచిత్రములు:—భాగస్వాములు, వరూధినీ ప్రవరాఖ్యులు.

ఏకవర్ణ చిత్రములు:—తంజావూరు (కోట) లోని శిల్పచిత్రములు ౧౦; ఆంధ్రసభల ఆహ్వానసంఘాధ్యక్షులు, అధ్యక్షులు-ఏలూరు; చెన్నపుర రాజధాని నూతనమంత్రివర్గము; శ్రీ నెల్లూరు నాగరాజరావుగారు వారి శివాజీపాత్రము; బ్రహ్మసమాజ ప్రార్థనమందిరము, కాకినాడ, కీ. శే. ఎస్. రంగస్వామి అయ్యంగారు; ఇతరచిత్రములును.



P. Satyanarayana.
Karnam 12-12-19..



చెన్నపట్టణము డిసంబరు ౧౯౨౬

సంపుటము 3 అక్షయ సంవత్సరము మార్గశిరమాసము సంఖ్య ౧౨



# విశ్వాసము

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

రాక బందరు; కదియును రైలు మీఁదఁ;
జేరె నా రైలు గుడివాడ స్టేషనుకును
ఎక్కువారును దిగువారు త్రొక్కటంబుఁ
గూరుచుండిరి; నే నట్టె కూరుచుంటి.

ఏను గూర్చున్న పెట్టెలో నెడము గలదు;
వలదనుచు నెక్కవచ్చెడువారిఁ ద్రోచి
నాదరిని గూరుచుండిన చౌదరి యొకఁ
డరయు చుండె నిట్టట్టు నాగరకు కొఱకు.

కరకరని తెల్లవల్వలుఁ గనుల జోడుఁ
జేతబెత్తముఁ దాలిచి లేఁత వయస్సు
బ్రాహ్మణుం డొక్కఁ డెక్క నర్హ మగుచోటు
నారయుచు నుండె నపుడు ప్లాట్ఫారమునను.

అప్పుడు చౌదరి యాతని
చొప్పరసెఁ, బిలిచె, నతఁడుఁ జొత్తె నుండెఁ;
గుప్పున వచ్చెఁ లోనికి
నుప్పరి యొక్కండు; ప్రక్క నొదికిలి నిలిచెఁ.

చాలఁగాఁ జొటుగల దతఁ డేలొకాని
కూరు చుండఁ డప్పుడు వానితీరు సూచి
పాఱయును మట్టితట్టయుఁ బాఱఁ జూచి
తొలఁగి పొమ్మని చౌదరి తొందరించె.

మూల నొదిగి నిల్చుండు; దండాలు బాబు,
ప్రక్కబండ్ల నన్నెవ్వరు నెక్కనీరు;
తిరిగి తిరిగి వచ్చితి నంచు దేవురించు
వాని నోదార్చి నే నిర్వ నాన యిడితి.

చే విసరి పిల్చెఁ జౌదరి; చేరె బ్రాహ్మ
ణుండు; నాతని ప్రక్కఁ గూర్చుండె; నపుడు
వెలి నిలిచి యొక్కవృద్ధుఁడు పలుకుచుండె
నభ్యనుజ్ఞఁ గాంక్షించు చున్నట్టు లిట్టు.

ఇంట నిబ్బంది తీఱఁగానే స్వయముగ
వెంటఁ గొనివచ్చి నే దిగవిడుతునోయి!
చూడు నామాట యని వృద్ధుఁ డాడుమాట
వింటి; "మీ రల్లు మామలా?" యంటి నేను.

"ఒక్కతే బిడ్డ, కనులముం దుండుననుచుఁ
బెండ్లి చేసితిఁ బొరుగూరి పిల్లవాని
కీతనికి నిచ్చి; యుద్యోగరీతి చేత
నీతఁ డన్యదేశమ్ములనే వసించు."

అంచు నావృద్ధుఁ డేదో నచియించుచుండె;
నల్లుని మొగమ్ము మటమట లాడుచుండె;
అట్టితఱి బిట్టు మొఱుఁగుచు నరుగుదెంచె
నుప్పరిని జేరఁగా నొక్క మూరఁగుక్క.

చూచి మూచూచి మునికాళ్ల లేచి యేచి
తోఁక నాడించుకొనుచుఁ దుందుడుకు తోడఁ
దన్ను నాకఁగా నాలుకఁ దవుకొనుచు
ముక్కుచునుమూలుగుచునున్న కుక్కఁజూచి.

ఉప్పరి మొగమ్ము వెడ తెల్విఁ దెప్పతిల్లెఁ;
దలుపుఁ దెఱచి దానికి గోము సలుపఁ దలఁచె;
దుమికి దుమికి లోనికి నది దూఁకఁ జూచె;
ధిక్కరించెఁ జౌదరి తల్పుఁ దెఱవకుండ.

మొఱుఁగుచునెయుండెఁ గుక్క; చీఁదఱగొను
నాగలేక కోపమున నానాగరకుఁడు [చును
చేతికఱ్ఱతో నాకుక్కమూతిమీఁదఁ
గొట్టె; నాయుప్పరిని జెషఁ దిట్టె మఱియు.

అంతలో గుఱ్ఱపుంబండి నమ్మగాఁతు
లరుగుదెంచి రిర్వురు; వారి నరసినంత
నల్లుని మొగమ్ముపయిఁ దెల్వి వెల్లివిరిసె;
మామ దిగులొందె, వచ్చితిరేమి? యనియె.

అత్త పలికెఁ దాళపుఁజెవిగుత్తి విడిచి
వచ్చితి రటంచు నల్లుతో; వగపు మఱపు
మురుపు మెఱపించు చల్లుఁడు మోవి గఱచి
కొనుచు జవరాలిమొగముఁ గన్గొనలఁ జూచె.

చుఱుకుచుఱుకుగా జవరాలు సూచెఁ, జూచె
మరలనాతఁడు, జవరాలు మరలఁ జూచె;
చూపు చూపు పరస్పరసూక్ష్మభాషి
తముల వివరించె వైద్యుత తంత్రులట్లు.

చూచుచుండిరి నలువు రీచోద్య మపుడు;
సూక్ష్మవేదనమ్మున మనస్సులు లగించె.
కుక్కగోడును నుప్పరి బిక్కరోఁడు
పెవరిమదికిని నెక్కనే యెక్క దయ్యె.

వాచ్యమునకంటెఁ జాతురి వ్యంగ్యమునకుఁ
బ్రబలమనుమాట నాకప్డు స్పష్టమయ్యె
వావిడిచి చేయు మొఱఁ జెవి వైచికొనక
కన్ను సన్నలే యెల్లరుఁ గాంచుకతన.

మామయులుకును, నల్లుని మోముకులుకు
తల్లి పయిపూఁతయును, గూఁతు జల్లిచేఁత,
ఆర్మిగల నెయ్యపుంజూపు మేల్మితీపు
లరయు చొక్కింత నే నబ్రమందు నంత.

రైలు కదలెడు వేళయ్యె; నాలుమగల
జాలిచూపులు కన్నీళ్ల నోలలాడెఁ;
గుక్క మొఱ యెక్కువయ్యెను; బిక్క మొగము
వెట్టి యుప్పరి గుండెపైఁ గొట్టుకొనియె.

చూచినాఁడ నే నీరెండుచోద్యములను;
రెండుపాయలై మనసు వర్తిల్లె నాకు;
ఈలమ్రోఁతయు, నంతలో రైలుకూఁత
తొట్రు గల్గించె; రైలును దోస కదలె.

కదలి రైలు ప్లాట్ఫారము గడచిసాఁగె;
దల వెలికిఁ జొన్పి యట్టె చూడ్కులు నిగుడ్చి
యువకుఁ డుప్పరియును జూచుచుండి రొదిఁగి
కూర్మియిల్లాలిజాడయుఁ గుక్కజాడ.

యువకుఁ డపుడు తన్ను నొంటిగ విడి దుఃఖ
పడుచుఁ దిరిగియేఁగు పడుచుఁ గనియె:
ఉప్పరీఁడు తన్ను నొంటిగ విడలేక
ప్రుక్కఁబట్ట వచ్చు కుక్కఁ గనియె.

దూఁకుచుండె రైలు తొందరగా దాని
తోడఁ గుక్కగూడ దూఁకుచుండె.
రైలుబండి ప్రక్కఁ గాలాప కాకుక్క
రాక మాకు నబ్బురంబుఁ గూర్చె.

అంతదాఁక వింత యైయున్న యువకుని
లీల మాకు మదులఁ దూలిపోయె:
అంతదాఁక రోఁత యైయున్న యుప్పరి
గోల మాకు మదుల నోలగించె.

రోఁజు చిట్టు కుక్క నూజెళ్ల స్టేషను
దాఁక రైలువెంట దూఁకివచ్చె.
ఎదిరిరైలు నప్పుడే బందరున నుండి
చేరుకొనియెఁ బ్లాటుఫారమునకు.

ఉప్పరీఁడు రైలు తప్పించుకొని వెలి
కరుగ నెఱుఁగఁడయ్యె నిఱుకటమున;
రైలువాండ్రు కుక్క రానీక తఱిమిరి;
నాకు నంత ఫ్రాన్స్కి లేకపోయె.

ఎదిరి రైలులోన నేతెంచుచున్నట్టి
మిత్రవితతితో సమేలములను,
అచటిరైలు కదలు నందాఁకఁ బనిలేని
పనిని నేను గాలమును గడపితి.

ముందుగానె కదలె బందరు వచ్చు మా
రైల్, హుటాహుటించి రాఁ దొడంగె;
నంతదాఁకఁ గొంత యాయాసమును దీర్చు
కొన్న కుక్క మరల వెన్నడించె.

కనుల నీరునించుఁ గనుఁగొంచు, నుప్పరీఁ
డుచ్చరించుఁ; గుక్క యెగిరి కొంచుఁ
బైకిరాఁ బ్రయత్నపడుఁ, గ్రిందఁబడుఁ, గొంత
దూరమగును, మరలఁ జేరుకొనును.

ఉప్పరీని నప్పు డోదార్చితిమి కుక్కఁ
జూచుకొనఁగఁ జక్కఁ జోటొసంగి;
చెప్పరోరి! కుక్కచొప్పను నీచొప్పు
ననుచుఁ గనికరించి యడిగితిమి-ని.

ఒక్కకన్ను కుక్కప్రక్కకు, మఱియొక్క
కన్ను మాదుప్రక్కకు న్నిగుడ్చి
చెప్పఁదొడఁగె నప్పు డుప్పరి తన పడు
త్రిప్పు లల్లకుక్క మెప్పు లెల్ల.

“ఒప్పుకొంటిమి గుడివాడ యొద్దఁ గొంత
మట్టిపని; చేయుచున్నాము; తట్ట పాఱ
విడిచి పెట్టిన మాపొట్ట గడవదండి;
యుప్పరులమండి; లేదండి యుప్పుగంజి.

ఇల్లులేదండి; పదిమంది పిల్లలండి;
తల్లి గాలివానకు నేటివెల్లువఁ బడి
నిరుడె చనిపోయెనండి; మాకరమమేమి
చెప్పనండి; మీకెందు కీ చీఁదఱండి!

పెద్దవానగాలి బెజవాడ బందరు
దేశములను నిరుడు నాశపఱచు
టెఱుఁగ రేమి బాబు! లీసీమ నీర్వచ్చు
గొట్టి పైర్లు నేల మట్టమయ్యె!

వడిగ వచ్చిపడిన బుడమేటి వెల్లువఁ
జెల్లిపోయెనండి పిల్లతల్లి;
అప్పుడండి, చావుఁ దప్పించెనండి, యీ
దొడ్డకుక్క నాకు బిడ్డలకును.

మనిసి బుద్ధికంటె మాదొడ్డ బుద్ధండి;
మసలదండి యెపుడు మమ్ము విడిచి;
వింత బాబు, దీని విశ్వాస; మెన్నని
చెప్పఁగలను దీని గొప్పతనులు!

కొంప గోడులేక కొండ్రలలోన మే
ముండఁగలమె దీని యండలేక;
చివ్వుమంచు లేచి చెల్లాడిచంపును
బందినైనఁ బ్రాచుఁబామునైన.

దానిగంజి ముందు, తర్వాత నాగంజి;
నేను దాని వీడలేను, నన్ను
నదియు వీడలేద యిదినిజము; కాకుక్క
ప్రాణమండి నాకు బాబులార!

కూలిడబ్బు తెచ్చుకొందును బందరు
వెళ్లి; నేను రాత్రి మళ్లి వత్తు;
గంజినూకకైనఁ గంట్రాక్ట రెప్పటి
కూలి నప్పుడీయక నాలిపెట్టు.

ఇచ్చునప్పుడైనఁ దెచ్చీఁడు; దండుగ
మంటిపనులు తనకు నింటికడను
జేయవలెను; మీఁద నేయిచ్చు; నందుకై
తట్టు, పాఱ వెంటఁబెట్టుకొంటి.

కుక్కఁ జక్కఁబట్టుకొండని పిల్లల
కప్పగించి దాని కందకుండ
నక్కనచ్చి నేను టిక్కెట్టు కొనుకొంటి;
నెట్టకేల కిచట నెక్కఁగంటి.

ఎపుడు నన్ను విడిచి యెఱుఁగదు గావునఁ
గుఱ్ఱగాండ్ర దూసికొన్నదండి!
వచ్చెనండి నన్నుఁ బసిపట్టి; రైలొద్దఁ
దాఁకనైతి దాని గోఁకనైతి.

కొన్నటిక్కెట్టు చెడునని కొంతభయము,
కోపగింతురు మీరని కొంతభయము,
కదలనీదయ్యె; నే రైలు వదలనైతి;
జాలిమాలితి; నాకూలి కూలిపోను.

కుక్క నాకు నింక దక్కునా, మాతండ్రి!
గుండెపగిలి నేలఁ గూలునేమొ?
పైన మాపి నాదు ప్రాణంబయిన వేఁపిఁ
బట్టుకొందుఁ గ్రింది తట్టు కుఱికి."

అను చాయుప్పరి కన్నీర
దొనదొనఁ గాఱంగ నేల దూఁకంబోవఁగ;
బెనుప్రొక్కి నాప నేని
ట్లని చెప్పితి వాని కప్పు డాశ్వాసముగాఁ.

కుక్కకై ప్రాణములను బోఁగొట్టుకొనకు;
నేలకుఱుకకు; నీ కుక్క నీకుదక్కు
నవలి స్టేషను రాఁగానె యచట నీకుఁ
గొని యొసంగుదుఁ దిక్కెట్టు కుక్కకొఱకు

అంటేఁ; బెట్టెలోని యందఱుఁ దత్కథ
నాలకించి యెంతో జాలిఁగొనిరి.
అదిఁ గసరుకొన్న చౌదరికన్నులు
చెమ్మరించె, నీరు క్రమ్మరించె.

కుక్కకు నీకున్ మఱువై
లెక్కన్ దిక్కెట్టుడబ్బు లే నిత్తును; ని
కిక్కడ వీ రిత్తురు గద,
కుక్కను నీవెంటఁ దోడుకొని పోగదరా!

అని యా చౌదరి మిగులన్
గనికరమునఁ బలికె; వాఁడుఁ గళవళపడుచున్
గనుచుండెఁ గుక్కరాకన్;
గనఁగా లేనైతిఁ గుక్క కష్టము నేనున్.

ఒడలెల్ల నుసుఁగు గట్టెను;
బడఁబాఱుచునుండె; వెనుకఁ బడుచుండె; నిఁకన్
గడుదూర మైన నిటు పరు
గిడఁజాల దటంచుఁ దోఁచె నెల్లరమదికిన్.

చేర నున్నాము కొత్తరంస్టేష నింక
నొక్కమైల్ దూరమున నదియుండు నేమొ!
కలదు రైల్ రోడ్డు కడ్డమై కాల్వయొకటి
దాని వంతెనపై రైలు దాఁటుచుండె.

కుక్క రైలుతో వంతెన నెక్కి దాఁటఁ
జోటు లేదయ్యె; రైలెల్ల దాఁటు దాఁక
నిలువరాదయ్యె దానికి; నీట నుఱికి
యీఁది యావలిదరిఁ జేరుకోఁ దలంచె.

కాల్వలోనికి నుఱుకుటఁ గంటి మేము;
కుక్క యావలియొడ్డున కెక్కుజాడ
గానరాదయ్యె; రైల్ వచ్చెఁ గొత్తరంబు;
గుక్కకొఱకని తిక్కెట్టుఁ గొంటి నేను.

ఐదునిమిషములయ్యె; రాలేదు కుక్క;
కూలె నాకొంప యని వాఁడు గోలపెట్టె;
నిల్వలేఁడయ్యె రైలులోఁ; గాల్వదరికి
వెళ్లిచూతు ననెన్; మాకుఁ గాళ్లు వణఁకె.

కొన్నతిక్కెట్టు నేనును, గొంతడబ్బు
చౌదరియు నీయఁబోఁ, గుక్క చచ్చె నేమొ
నీటఁబడి; నాకు నివి యింక నేటికనుచు
దిగులుగుండెలతో వాఁడు దిగెను రైలు.

"దిగితి నిప్పుడు; నే నింక దిగిన నేమి;
దిగక చచ్చిన నే; మది తీఱియుండు.
ఆడ గుడివాడ నన్ను వెంటాడినపుడె
రైలుదిగనైతి! నా కుక్కఁ గోలుపోతి!

కుక్క చచ్చెనేని కూలి నా కింకేల?
కుక్కలేక రైలు నెక్కఁజాల!
కుక్క నాకు దిక్కు: కుక్కకు నే దిక్కు!
దక్కు నాకుఁ గుక్క కొక్కదక్కు.

బాబులార! కుక్కతోఁ బోదు నే" నంచు
గుండెమీఁద బాదుకొంచు వాఁడు
తట్ట పాఱుమాట తలపెట్ట కొకపెట్ట
పరుగు వాఱెఁ గాల్వ ప్రక్కకపుడు.

దూఁకె రైలుతో సుదూరము, గుండెల
కధిక దుస్సహ ప్రయాసమయ్యె.
అట్టిదింక నీఁదు టెట్టులు? చలినీటఁ
బడినతోన గుండె పగిలె నేమొ?

పలికెఁ దనకుఁ బ్రాణపద మని యా కుక్క
పరయఁగల్గె నేమొ యాతఁ డచట?
ఉసురుతోడ నున్నదో లేదో? యది యుండ
కున్న వాని జీవ ముండఁగలదె?

నొచ్చుకొంటి నేను:— నూజెళ్లలో వాని
దింపనైతి; గుక్కతిక్కయైన
విలిచి యూయనైతి; "విప్రులు పశ్చిమ
బుద్ధు" లన్ననుడి సుబద్ధ మయ్యె.

తీగ నేఁ గాల్వదరినైన లాగియున్న
నాగపూర్ రైల్, కుక్కవానికి నబ్బియుండు.

కారణం బద్దు నని గార్డు గారి కపుడు
వెఱచియుంటిని, దుది కౌదు గఱచికొంటి.

తఱియయ్యె రైలు గదలెను
మఱి మామాపనుల మేము మసలితి, మైనఁ
మఱపునకు రాదు, నామది
నెఱవుకొనఁ గుక్కగాథ నిత్యస్ఫూర్తిఁ.




# లోక యాత్ర

శ్రీ శివశంకరశాస్త్రి [సాహితీసమితి]

[౧౯-౨౮]

౧

నాయకుడు

లోకవికసన మాత్మవీక్షా
లోకమున ఘటియించు రాధా
వల్లభా, కైకొమ్ము దాసుని
వందనం బిదిగో!

భక్తితో చిత్తమున నీపద
పంకజమ్ములు నిలిపి కరుణా
వీక్షణోత్సుకవృత్తి దాసుడు
వేచియున్నాడు!

తెల్లవారుచు ప్రొద్దు గ్రుంకుచు
దినము లెన్నో గడచి పోయెను
గాని నీ కీదాసజనుపై
కరుణ రాదాయె!

క్లేశరేఖావ్యాపగతము లై
కేవలము సుఖ మొందగా దగు
వాసరమ్ములు గడచుచున్నవి
వ్యర్థముగ నాథా!

యౌవనోత్తాలోర్మ్ము లెల్లను
సంతకంతకు నణగుచున్నవి,
మంథరమ్ముగ దరియుచున్నది
మరణయామవతి!

తొలగిపోయె మనోరథమ్ములు
దూరముగ, నిక నొక్కకోర్కయె
వేచుచున్నది మానసమ్మును
విడువ కనిశంబున్.

వందనము గైకొమ్ము రాధా
వల్లభా, లోకైకనాథా,
దీను గారుణ్యార్ద్రశీతల
దృష్టి గన్గొనవే!

# సంస్కృతవాఙ్మయమందలి గద్యకావ్యములు

విద్వాన్ సూరిగుచ్చి వీరభద్రుఁడుగారు

ప్రపంచమందలి భాషలన్నిటిలో సంస్కృతమే మిక్కిలి పురాతనమైయున్నది. అందువలననే మన లాక్షణికులెల్లరు "తల్లి సంస్కృత మెల్లభాషలకును" అని నుడివియున్నారు. భాషాతత్త్వశాస్త్రజ్ఞులగు పాశ్చాత్యులు సయితము భాషలన్నిటిలో సంస్కృతమే ప్రాచీనమని నిశ్చయించి మాతృభాష సంస్కృతము గాదనియు, వీనికన్నిటికిని మూలము మఱియొకటి యుండవలయుననియు ససందిగ్ధముగా వ్రాసియున్నారు. మాతృభాష, సంస్కృతమైనను, గాకపోయినను భాషలన్నిటిలోఁ బురాతనమైనదని యందఱు నంగీకరించియే యున్నారు. ఇట్టిసంస్కృతమే యనేకభాషల కనేకనూతనవిషయములలో మార్గము చూపియున్నది. వ్యాకరణాదిశాస్త్రములలో నీ సంస్కృతమున హిందువులు చేసినంతపరిశ్రమ యేభాషలో నెవరిచేత నింతవఱకుఁ జేయఁబడియుండలేదు. వివిధశాస్త్రములలోను వివిధములగు గ్రంథములు లెక్కలేనన్ని యీ సంస్కృతమునఁ గలవు. ఇంతవాఙ్మయముగల యీ సంస్కృతమున గద్యకావ్యములే డెనిమిదికన్న నెక్కువ లేవనుట యెల్లవారికి నాశ్చర్యమును, విషాదమును గలిగింపక మానదు.

బాణుఁడు తన హర్షచరిత్రములోఁ దనకుఁ బూర్వమున్న వచనకావ్యముల నీ క్రిందిశ్లోకములలోఁ బేర్కొనియున్నాఁడు.

కవీనా మగల ద్దర్పో
నూనం వాసవదత్తయా;
శక్త్యేవ పాండుపుత్రాణాం
గతయా కర్ణగోచరమ్."

(వాసవదత్తచేఁ గర్ణగోచరమైన శక్తిచేతఁ బాండుపుత్రులకువలెఁ గవులకు గర్వభంగమైనది.)

"పదబంధోజ్జ్వలో హారీ కృతవర్ణక్రమస్థితిః;
భట్టారహరిచంద్రస్య గద్యబంధో నృపాయతే."

(పదబంధోజ్జ్వలము, మనోహారము, కృతవర్ణక్రమస్థితియు నైన భట్టారహరిచంద్రుని గద్యప్రబంధము రాజనఁ దగియున్నది.)

బాణుఁడు పేర్కొనిన గద్యబంధవాసవదత్తలును, బాణుని కాదంబరీహర్షచరిత్రములును, దండిదశకుమారచరిత్రమును, వామనబాణుని వేమభూపాలచరిత్రమును, ధనపాలుని తిలకమంజరియు ననునవిమాత్రమే మనకుఁ బ్రస్తుతము కన్పట్టుచున్నవి. క్రీస్తుశకము ఆఱవశతాబ్దముననున్న దండి తన కావ్యాదర్శములో

"గద్యంపద్యంచ మిశ్రంచ [illegible]
త్యాహు రార్యా శ్చతుర్విధమ్."

అని గద్యమునుగూడ నొక ప్రభేదముగా నంగీకరించి యుండుటచే నింతకుఁబూర్వమే కొన్ని గద్యకావ్యములు వ్రాయఁబడి యుండవలెనని యూహింపవలసి యున్నది. అవి కాలక్రమమున నశించియుండవచ్చును. కొన్ని నశించినను మొత్తముమీఁద నీ సంస్కృతవాఙ్మయమునఁ బదునేనుకంటె నెక్కుడు గద్యకావ్యములు వ్రాయఁబడి యుండ లేదని చెప్పవచ్చును. ఇంత వాఙ్మయముగల సంస్కృతమున నీ గద్యకావ్యములు నశించుటకుఁ గాని, తక్కువగా వ్రాయఁబడుటకుఁగాని ప్రబలములైన కారణము లుండియుండవలయును.

సాహిత్యకలాసముల్లాస మనునది యనల్పకల్పనాకుశలమును, సంతుష్టమును నైన మనసుయొక్క ప్రతిబింబమేకదా! మనుష్యున కానందము గల్గినపు డతఁడు తనభావమును స్వరము మధురమైనను గాకున్నను సంగీతరూపముగనే వెలిపుచ్చుననుట యందఱకును ననుభవసిద్ధమే. ఇట్లు శనభావము గానరూపముగా వచ్చుటకు పద్య మనుకూలమైనట్లు గద్య మనుకూలము గాదుగదా! అందువలననే యేభాషలోనైనను మొదటఁ గవిత ఛందోరూపమున బయలువెడలుట. సంగీతకల, సాహిత్యకల అను నీ రెండును సమానమైన యోగక్షేమములు గలవని 'సంగీతంచ సాహిత్యంచ సరస్వత్యాస్తనద్వయ' మ్మను సూక్తి వలనఁ దెలియుచున్నది. కాఁబట్టి గానమునకు గద్య మనుకూలింపమిచేఁ బ్రాచీనములైన ఋగ్వేదాద్యులు పద్యరూపముననే వ్రాయఁబడినవి. మఱియు నాకాలమున లిపి లేకపోవుటచేనేమి, జ్ఞాపకముంచుకొనవీలగుననను నుద్దేశముతో నేమి, యట్లు ఛందస్సులో విస్తారముగా గ్రంథములను మనపూర్వులు వ్రాసియుందురు. తరువాతను రానురాను పద్యకవితయే కవిత్వమనియు, గద్య కవిత కవిత్వముగాదనియు ననుదురభిప్రాయము ప్రబలఁజొచ్చినది. ఇట్టి యభిప్రాయ ముండఁబట్టియే బాణుఁడు తన హర్షచరిత్రములో నీరీతిగా వ్రాసియున్నాఁడు:

"ఉచ్ఛ్వాసాంతే ప్యఖిన్నా స్తే
యేషాం వక్త్రే సరస్వతీ;
కథ మాఖ్యాయికాకారా
న తే వంద్యాః కవీశ్వరాః"

(ఉచ్ఛ్వాసాంతమున నఖిన్నలును నవిచ్ఛిన్నప్రతిభ గలవారునునైన ఆఖ్యాయికాకారులగు కవీశ్వరు లెట్లు వంద్యులుగారు!)

గద్యలో వ్రాసినఁ దాము గవులముకామను నుద్దేశము గలవా రగుటచే వ్యాఖ్యానములు, లక్షణగ్రంథములు మొదలగువాని నన్నిటిని మనపూర్వులు ఛందస్సులోనే వ్రాసియున్నారు. దానంజేసియే యిప్పుడు కొన్నిటికి రచయితల యభిప్రాయములు బోధపడకుండుటయు, నందువలన విపరీతార్థములు తీయుట కవకాశములు గల్గుచుండుటయు, సంభవించుచున్నది. వచనములో వ్రాసిన నిట్టివిపరీతార్థములు తీయుట కవకాశము గలుగదుగదా!

కొంద ఱిది దేశభాష గాదనియు, దేశభాష గానున్నపుడె గద్యరచనమున కావశ్యకత యున్నదనియు, నందువలన సంస్కృతమున

గద్యవైరళ్య మాశ్చర్యమును గలిగింపఁజాలద
నియు నుడువుచున్నారు. మరియు వారు ప్రాకృ
తభాషనుండి పాణిన్యాదులచే సంస్కరింపఁ
బడినదగుటచేత సంస్కృతమని పేరువచ్చినదని
యందురు. దానికి బలముగా వారీ క్రింది
యుక్తులను జెప్పుచున్నారు.

"అప్పుడు ప్రాకృతమే దేశభాషగా నుండె
డిది. ప్రకృతిసిద్ధమైన భాషగనుక ప్రాకృతమని
పేరువచ్చినది. అందువలననే దీనికి దేశభేదమును
బట్టి మాగధీ, మాహారాష్ట్రీ, శౌరసేనీ, పైశాచీ
అను మొదలగు నామములుకూడఁ గలిగినవి.
ఇట్లే మనప్రాచీనపండితులుకూడ నభిప్రాయపడి
యున్నారు. "ప్రాక్-పూర్వం + కృతం=ప్రాకృ
తం, అనిగదా వ్యుత్పత్త్యర్థము. అందువలననే
ప్రాకృతము మొదటను, సంస్కృతము తరువా
తను శాస్త్రకారులచే వ్రాయఁబడినది. పాణిన్యా
దివైయాకరణులచే సంస్కరింపఁబడినది కాన
సంస్కృత"మని నమిసాధువు చెప్పియున్నాఁడు.
పైనవ్రాసినదానినిబట్టి సంస్కృతము దేశభాష
కాదనియు నందువలన సంస్కృతసాహిత్య
ములో గద్యవైరళ్యము కలిగెననియు పైవారి
యభిప్రాయమైయున్నది.

కాని యీయభిప్రాయము మిక్కిలిదుర్బ
లమైయున్నది. భాషయనఁ దమయభిప్రాయము
నితరులకుఁ దెలియఁజేయు సాధనావిశేషమే
కదా! ఈ సంస్కృత మెప్పుడును వ్యవహార
మునందు లేనియెడల నిది యొకభాషయే కాఁ
జాలదు. అప్పుడప్పుడు వ్యవహారమునం దుప
యోగింపఁబడిన భాషారీతియే ఋగ్వేదము
నందును, నుపనిషత్తులయందును మనకు లభ్య
మగుచున్నది. పాణిని సూత్రములలో "దూరా
ద్ధూతే" అను మున్నగువానినిఁబట్టి యిది వ్యవ
హారమం దుండెనని విశదమగుచున్నది. కాఁబట్టి
యిది దేశభాష కాదనుట మహాసాహసము.
మరియుఁ బైవారుచెప్పిన ప్రాకృత సంస్కృత
పదార్థనిర్వచనము సరికాదు. ప్రకృతి సంస్కృ
తమనియు, దానినుండివచ్చినది ప్రాకృతమని
యుఁ బూర్వపండితులయొక్కయు, నవీనులగు
పాశ్చాత్యభాషాతత్త్వశాస్త్రజ్ఞులయొక్కయు
నభిప్రాయమై యున్నది. గనుక గద్యవైరళ్య
మునకుఁ బైవారు చెప్పినవి సరియైన కారణ
ములు కాఁజాలవు.

మరియు ఛందోబద్ధమైన వాణి సంగీత
ముతోఁగూడి యొకచోట వైకల్యమున్నను
సర్వాంగసుందరి చూచువారినివలె, సన్నివేశ
విశేషముచే, వినువారి మనస్సు నాకర్షించును.
భావాదులు లేకపోయినను గద్యకవిత్వమువలె
ఛందోబద్ధకవిత్వము త్వరలో వెల్లడిగాదు.
అందువలననే పద్యరచనయం దాసక్తిమెండు
గానుండుట. కావ్యమార్గమున నడచువాఁడె
వఁడు తనకు స్ఖాలిత్యము రానీయనిమార్గము
నవలంబింపకుండును? అందఱును సుకరమును,
సులభమును నైనమార్గమునే యవలంబింతు
రుగదా!

గద్యరచనమునకు స్వతస్సిద్ధము, నాకర్షక
మునైన సౌందర్యములేదు. అయినను రసభా
వాది నిబద్ధము, సరసపదభూయిష్ఠమునైన
గద్యకవిత్వము పద్యకవిత్వముకన్నఁగూడఁ
ద్వరగా సహృదయుల నాకర్షించును. [illegible]
పాతములేని సహృదయుఁ డెవఁడు కాదంబరీ

రసము ననుభవించుచు సలసములైన పద్యము లనువలె నభిమానింపకుండుదురు? 'కాదంబరీరస జ్ఞానామాహారోఽపి నరోచతే!'(కాదంబరీ రస జ్ఞుల కాహారముగూడ రుచింప) దను సూక్తిని బట్టి యంతకన్న నెక్కువగాఁగూడ నభిమానింతురనియే యనవలసియున్నది. అయినను గద్యసృష్టిప్రయత్నము మిక్కిలి యోర్పుతోను, కష్టముతోను నెదుర్కొనవలసియున్నది. అందువలన గద్యరచనమునకు సంసిద్ధులగు వారు మిక్కిలియరుదుగా నుందురు. సులభమైనమార్గమును విడిచిపెట్టి కష్టసాధ్యమైన మార్గము నెవరు నవలంబింపరుగదా! ఈపైయభిప్రాయమునుబట్టి సంస్కృతవాఙ్మయములో గద్యకావ్యములు తక్కువగానున్నవని మన మూహింపవలసి యున్నది. ఇంతవఱకును సంస్కృత వాఙ్మయమున గద్యకావ్యములు తక్కువగానుండుటకుఁ గారణములుమాత్రమే విమర్శింపఁబడియున్నవి. మఱియొక వ్యాసమున వానియందుఁ బ్రజలకుఁగల యాదరణము, శైలి మొదలగువిషయములనుగూర్చి విమర్శింపఁబడును.



## ఎడఁబాటు

[ఆదిపూఁడి సోమనాథరావు గారిచే ననువర్తింపఁబడినది]

నీవు ననువీడి చనఁగానె నిలయమెల్లఁ
 బ్రాణమెడలినకాయంబుపగిది నుండె
ఘోర శోకాంధకారానఁ గూలియుంట
శూన్యముగఁ దోఁచె జగమెల్ల సుఖములెల్ల
నకట, పూర్తిగ మృగ్యమై నట్టులుండె
ఒంటిగా నన్ను మరణ మీయూర్మిలోన
ద్రోసినట్టులు నామదిఁ దోఁచుచుండె
నెమ్మి నామదికంతయు నీవె కాన
నీవు పోయిన నిఁక నాకు నిలుచునెద్ది?

కొద్దివైనను హాయిఁగాగూడి మనము
మెలఁగిన దినమ్ములన్నియు స్మృతికి రాఁగ
నశ్రుపూరితమైన నా యక్షులకును
నెచటఁజూచిన దుఃఖమున్ హెచ్చుజేయు
క్రొత్తదాఘోరకష్టమే గోచరించె.

ఇంపుగాను మనము పఠియించినట్టి
యెలమిఁ గ్రొత్తగ నీవు నాకిడిన యట్టి
రమ్యమైనట్టి పుస్తకరత్నమదిగో!

అరయ నెటఁజూడ నీప్రియమైన పనియొ,
మంచిమాటయొ, రూపంబుఁగాంచి నేఁడు
విడువని నిరాశలోఁబడి వేఁగునన్నుఁ
గటకటా వెక్కిరించిన కరణిఁదోఁచె.

కడఁగి మనుజుండు గాంచు సుఖంబు లెల్లఁ
గంటి నీతోడఁ గాలముగ్ గడపినపుడు
చనిన నీ వింక నాకు నాదినము లిపుడు
తెగని చుట్టగఁజుట్టిన వగపుచేతఁ
భీకరాకృతిఁ దాల్చె నీవిధిని నేఁడు.

—ఎల్లా హీ్వలర్ విల్కాక్సు.



# ఎవరు?

మిన్నికంటి గురునాథకవి గారు

చూపెదు రాక, నీ నెలవుఁ జూపవు; చూపెదు పోక, యేడకో
చూపవు; చూపెదాతనువుఁ, జూపవు వ్యక్తివిభేద; మంతలోఁ
జూపెద వొద్దనున్నటులు చూపవు కారణ మెందుకోసమో?
నీ పనులెల్లఁ జిత్రములు నీవెవరో కద, సాక్షికుండవో?

ఉ. ఎన్నివిధాలఁ బట్టుకొన నెంచినఁ జిక్కవు, మింటితోడ నీ
కున్నదొ మైత్రి? వెల్గుఁగని యొంటిగఁ బర్వెదు, వెల్గుతోడ నీ
కున్నదొ మైత్రి? రేఁ దిరుగుచుండెదు నక్కుచు, దొంగతోడ నీ
కున్నదొ మైత్రి? తెల్పఁగదవోయి యెవండవు, జాలికుండవో?

చ. హిమమును, నీవుఁ దోడుగ జనించితిరో యలరేయికన్నెకున్;
భ్రమరము, నీవు నొక్కబడిపంతుల చెంగట విద్దెలన్ సమ
గ్రముగ గ్రహించినారొ? పలుగాకులపొందిక గల్గియున్నదో?
క్రమముగఁ జెప్పు మెవ్వఁడవు? రాజువొ, దొంగవొ, జాలికుండవో?

ఉ. క్రొవ్వెద నల్లగల్వ విరిఁగ్రుచ్చి, కనుంగవఁదీర్చి కాటుకన్,
నవ్వుమొగానఁ గస్తురి గనంబడ బొట్టుఁ గుదిర్చి, నల్లనౌ
మవ్వపు వల్వఁ దాల్చి ప్రియుమన్ననకేఁగెడు పువ్వుఁబోఁడి, నీ
వెవ్వఁడవోరి, మాయమొనరించితి వక్కట! సాక్షికుండవో?

ఉ. కాల్చినబొగ్గువంటి గురుకాయము సూచి యెవర్తె మోహముం
దాల్చి పరిగ్రహించి ప్రమదం బొనఁగూర్చెనొ? చిత్ర! మాబిడం
బిల్చుచు విప్రలంభమున వేఁగెదు నేఁడును; మంచుబొట్టులన్
రాల్చెద, వేడ్చెదో? తెలుపరా పురుషుండవొ, జాలికుండవో?

ఉ. పిల్లలు నిన్నుఁ జూచి కడుభీతిని గెవ్వునఁ గేక వేయుచుం
దల్లుల చాటు కేఁగెదరు దండధరుండవొ? లేక మావలెం
గాళ్లను గన్నులుం దలయుఁ గాయము సర్వము నీకు లేదొ? నా
యుల్లము సంశయించెడుఁగదోయి, వచింపుము సాక్షికుండవో?

ఉ. అందఱు సూచుచున్న సమయంబున గిన్నెలక్రింద నుండలం
బొందుగఁజేర్చి మాయమయిపోవఁగ విప్రవినోది సేయు; నీ
చంద మదేమొ, గిన్నియల చాటునఁగాక యదృశ్యముం బొన
ర్పం దొరకొంటి వస్తుసమవాయ! మెవండవు, సౌఖికుండవో?

ఉ. కిమ్మనఁ డొక్కఁడైనఁ; బరికింపదు నేలయుఁ; బిట్టగూడ నీ
డమ్మునఁ గీచుకీచన; దెటం జివురాకయినం జలింప; దీ
వెమ్మెయి మచ్చుమందు నొలికించితొ ద్రష్టలపై? విచిత్రకా
ర్యమ్ములు సేయు నీ వెవఁడవయ్య, వచింపుము సౌఖికుండవో?

ఉ. మౌనముఁ బూనియుంటి; గుహామధ్యమున న్మనుచుంటి; పారవ
శ్యానఁ దనర్చుచుంటి; వణిమాదుల నేర్చునుగంటి; క్షుత్తృడా
ధీనముగాని మన్కి గడిదేఱితి యోగవిధంబునన్; నిజం
బైనభవచ్చరిత్ర దెలియంబడ దెంతటి సౌఖికుండవో?

ఉ. వేదురు గూబమూఁకలకు విందులువెట్టెడు కీచురాలతో
నేదియొ ముచ్చటాడెద; వొకించుక నేపయినన్ శ్రమమ్ము పెం
పేదఁగ నిల్వ వొక్కెడఁ, జరింతు మహీతలమెల్ల; సౌఖ్య సం
పాదిభవ త్ప్రసక్తి; దెలుపంగదె నీతలిదండ్రు లెవ్వరో?

సీ. ఒక్కొకవేళ నల్దిక్కులకుం బాఱి, గంపడంచును ఘటోత్కటమదంబు
ఒక్కొకకాలమం దుబ్బుచుఁ గొండల, పింఛు బెండుంబోలె విసరుచుండు
ఒక్కొకసమయమం దుల్లాసముగనుండు, బూపాత్మజాసుఖాశ్లేషణముల
ఒక్కొకప్పుడు నింగి కుఱికి నిర్ఘోషభీషణవార్షుకాభ్రసంచయము నడఁచు
మివులఁ గాసల నల్లతో మేలమాడు, సాంద్రవటవిటపిచ్ఛాయ సంచరించు
ననెడు నీయానడతవిని యంధకాసురునకు బాంధవుండవొకొ; నీవని తలంతు.

వ. నేను సాయంసమయవిహారమున కేఁగి యీపద్యముల వ్రాయునప్పటికి చీకటి యంతరా
యముఁ గల్గించుటచే మిత్రులతో నిలుసేరితిని. ఏల నీ యసహిష్ణుత్వము?



# రామాయణమునందలి వానరు లెవరు?

కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి గారు

(వెనుకటి సంచిక తరువాయి)

## రావణశబ్దముంగూర్చి

"రావయతీతి రావణః" అని మన పెద్దలు చెప్పుచున్నారు. ఆయర్థమును మనరామదాసుగా రంగీకరింపక శబరభాషతో సంబంధము కలుపుటకై యీక్రింది యపూర్వోత్పత్తిని దెలిపిరి.

"అయినప్పటికి 'రావణ' అనుపదము 'రామేణ్' యొక్క సంస్కృతరూపమేమో? "సవరలు పిల్లికి రామేణ్" అందురు. ఈ యర్థమును కొంచెముగా సూచించు వాక్యములు ఒకటి రెండు మాత్రమున్నవి. "కామరూప మహం భద్రే పశ్యమాం కామదం పతిమ్"

—అరణ్య-౪౯-౪

అని రావణుడు సీతతో చెప్పినట్లున్నది. ఇచ్చట 'కామరూపిణం' అనుపదము 'కామరూపి'కి ద్వితీయా ఏకవచనముగా వచ్చును. అట్లయినట్లయితే 'కామరూపి' అంటే అడవిపిల్లి' అని యర్థమగుచున్నది. ఈయర్థమే తీసుకొనినయెడల 'నేను అడవిపిల్లిని; నన్ను నీభర్తగా వరించుమ'ని పైవాక్యమున కర్థమగుచున్నది. పిల్లి మామూలుగా అరచినప్పుడు గాక కోపముతో అరచిన నెంతభయంకరముగా నుండునో అందరకు తెలిసినదే. తన అరుపులచే లోకములనుభయ పెట్టుదునని రావణుడు సీతతో జెప్పెను. 'నాదైర్విఖ్యాతవిరావిణమ్' కాన ఈరెండింటినిబట్టి 'రావణ' అనునామము యొక్క అర్థము సూచితమగు చున్నదని భావింపనగును. అందుచే 'రామేణ్' (పిల్లి) అనుశబ్దమునుండియే 'రావణ' అయియుండు నని తలపవలసి వచ్చెను."

ఇది వట్టి పిచ్చివ్రాత. రావణశబ్దము పిల్లి యనునర్థముగల 'రామేణ్' అను శబరభాషాపదము నుండి పుట్టినదంట! ఇంతకంటె విచిత్రపు వ్రాత యుండఁగలదా? లోకవిద్రావణుం డగు రావణుఁడు పిల్లియెట్లాయెనని దాని సారస్యముఁ జూపుటకుఁగూడ మన రామదాసుగారు యత్నించిరి. శ్రీ మద్రామాయణములో 'కామరూప మహంభద్రే పశ్య మాం కామదం పతిం' అని యున్నదఁట. ఈవాక్యములు రావణుఁడు పిల్లి యని తెలుపుచున్నవఁట. తనఘనతను వర్ణించి సీత తన్ను మోహించునట్లు చేసికొనుటకై భిక్షురూపధరుఁడైయున్న రావణుఁడు పలికినపలుకు లివి. ఈవాక్యములనుబల్కిన వెంటనే యాతఁడు తన కామరూపమును విడిచి(సన్న్యాసిరూపమును) విడిచి భీకరమగు నిజరూపమును ధరించెనని యీక్రిందిశ్లోకమునఁ జెప్పఁబడి యున్నది.

"శ్లో. సర్వస్సాన్న్యం పరిత్యజ్య భిక్షురూపంచ సమ్మతమ్;
స్వరూపం కాలరూపాభం భేజే వైశ్రవణానుజః."

ఇట్టి సందర్భముం బట్టియును, వ్యాఖ్యాతలు వ్రాసినవ్రాతలం బట్టియును, నౌచిత్యముం బట్టియును విచారించిచూచిన పైశ్లోకమునందుఁగల 'కామరూపిణం' అను పదమునకు కామరూపమును నన(గా నిచ్చవచ్చినరూపమును (సన్న్యాసిరూపమును) ధరించినవానిని అని యర్థము చేసికొనవలెనని బాలుఁడైనగ్రహింపకపోఁడు. రావణుఁడు నిజరూపమును విడిచి భిక్షురూపమును ధరించి యుండికదా ఈవాక్యములు పలికెను. వెంటనే యాకామరూపమును అనగా భిక్షురూపమును విడచి నిజరూపమును జూపెనుగదా. కావున నిచటి 'కామరూప' శబ్దమునకు నిచ్ఛానుసారముగా ధరించురూపమని యర్థము చేసికొనవలెను. ఈసందర్భమునంతను విడచి మనరామదాసుగారు 'కామరూపి' యను శబ్దమును దీసికొని దానికి నడవిపిల్లియని యర్థము జేయుదురఁట! ఇది

పెద్దవింత. కాముకుఁడైయుండు రావణుఁడు తన్నుఁ గామించునట్లు చేసికొనుటకై నేను 'కామరూపిని' అనగాఁ 'బిల్లి'ని అని సీతతోఁ బలికెనఁట! పిచ్చివాఁడైన నిట్లు పలుకునా? 'నేను అడవిపిల్లిని నన్ను నీభర్తగా వరింపుము' అని పలికిన సీతకు రావణునందు గౌరవభావమును, మోహమును కలుగునా? కలుగవు గావున 'నేను అడవిపిల్లిని నన్ను వరింపుము' అని రావణుడు సీతతోఁ జెప్పెననుమాట యనుచితము. ఈయనౌచిత్యమును బోఁగొట్టుటకై రామదాసుగారు మఱియొకవింతవాదము లోనికి దిగిరి. నేను బిల్లినన మార్జాలమువలె భీకరమైన ధ్వనిని జేయువాఁడనని యర్థమంట! లోకములో 'వీఁడు పిల్లి' అనినను, 'పిల్లివంటివాఁడు' అనినను, మెత్తనివాఁడని యర్థమగు ననునది సర్వజనవిదితము. ఇట్లుండఁగా 'నేను పిల్లివంటివాఁడనన భీకరమైన రావము గలవాఁడ' నని రామదాసుగారు విపరీతార్థము చేసిరి. "పిల్లి మామూలుగా అరచినప్పుడుగాక కోపముతో అరచిన నెంత భయంకరముగా నుండునో అందరకూ తెలిసినదే." అని రామదాసుగారొక వింతవాక్యమును వ్రాసిరి. పిల్లి కోపముతోఁ గూసినమాఁతలకైన మానవులు భయపడుదురా? ఎలుకలును, ఎలుకలతోఁ దుల్యులును భయపడుదురు. మానవత్వమున్నవాండ్రు భయపడరు. కావున 'నేను పిల్లి'నన 'భీకరమైన రావము గలవాఁడ' నని యర్థము చెప్పుట యసంగతము. అట్టి యర్థము చెప్పవచ్చుననినను రావణునందుఁగల ఘనతను, విశేషమును నిరూపించునది యిది కాఁజాలదు. ఏమన, రామాయణములో భిక్షురూపధారియై రావణుఁడు సీతతో ముచ్చటించు ఘట్టమునందే రావణుఁడే రాక్షసు లెల్లరు కామరూపులని సీతతోనే ముందుగా నీక్రిందివాక్యములను బలికెను.

> "రాక్షసానా మయం వాసో
> ఘోరాణాం కామరూపిణామ్."
>
> —అర. ౪౮, ౖ౨.

రాక్షసు లెల్లరు కామరూపు లనగా పిల్లులని చెప్పువాఁడు తానుకూడ పిల్లినని చెప్పుకొనిన తనయందు విశేష మున్నట్లు సీతకుఁ బోడకట్టునా? కాన 'కామరూపిణం' అనగా 'కామరూపమును ధరించిన వానిని' అని పండితమార్గముగా నర్థముచేయక 'పిల్లిని' అని అర్థముచేసిన సర్వమును ననుపపన్న మగును. రాక్షసు లెల్లరు కామరూపు లని రామాయణములోఁ బలుతావులఁ దెలుపఁబడి యున్నది. ఇఁక నొక నుదాహరణము నిచ్చెదను.

> "తే కామరూపిణ స్సర్వే
> దంష్ట్రిణః పింగళేక్షణాః."
>
> —యుద్ధ. ౯౮. ౧౯,

తన అరుపులచే లోకమును భయపెట్టుదు నని రావణుఁడు సీతతోఁ జెప్పెను. 'నాదైర్విఖ్యాతవిరావిణమ్' అని తమవాదమునకుపబలముగా నుండుటకై రామదాసుగా రిఁక నొకవాక్యమును లిఖించిరి. 'నాదైర్విఖ్యాతవిరావిణమ్' అను పదములకును, 'కామరూప మహమ్' అను పలుకులకును భీకరమగు నాదము కలవాఁడనను నర్థమే యగునో నందులకు రెండువాక్యములు చెప్పనేల? ఒకటి యనవసరమైపోదా? కాన రావణుఁడు సీతతో 'నాదైర్విఖ్యాతవిరావిణమ్' అనుపదములచేఁ దననాదముయొక్క భీకరతను వెల్లడించెను. కాన 'కామరూప మహం భద్రే' అనుదానికి నర్థము వేఱుగ నున్నదని బుద్ధిమంతు లెల్లరును గ్రహించుకొనవలసి యున్నది. అది యేది యనః కథాసందర్భముంబట్టియును, కామరూప శబ్దమునకు సుప్రసిద్ధమై యుండు నర్థముం బట్టియును నిచ్చవచ్చిన రూపమును ధరించువాఁడనని యర్థము చెప్పుటయే. ఇంత యేల, 'రామేక్' అను శబరభాషాపదమునుండి రావణ శబ్దము పుట్టినదని శబ్దశాస్త్రగమునికంబట్టి చూచినను బుద్ధిమంతు లెవ్వరును దలంపఁజాలరు. రామదాసుగారును తాము చెప్పు నర్థమును లోకు లంగీకరింప రనుభీతిని బొందియుండక పోలేదు. కావుననే రావణశబ్దార్థవిచారము చేయఁబోవుచు "రావణుఁడు రాక్షసుడు గాన ననార్యుడే. అయినను వానినామము అనార్యభాషోత్పన్నమైనదని సూచించు వాక్యము లేవియు రామాయణమునందు గానరాకున్నవి" అని లిఖించిరి. ఇంకను హేత్వంతరమునుగూడఁ జూపదలంచి సవరలలో గోత్రములు గలవనియు, అవి మృగనామములు, వృక్షనామములు కలిగి యున్నవనియు, రావణునిది పిల్లిగోత్రము కావచ్చుననియు, నావంశమున నాతఁడు పెద్దగావున నా మార్జాల గోత్రనామమే యతనినామము కావచ్చుననియు వ్రాసిరి.

ఈవిషయమై చర్చించుటకు పూర్వము రావణజాతిం గూర్చి ముచ్చటించుకొనుట యవసరము కావున నట్లొనర్చుకొందము.

## రావణునిజాతి యేది?

వానరులను శబరులని వ్రాసిన రామదాసుగారు రావణాది రాక్షసులనుగూడ శబరులని వ్రాయుట వింతనుబుట్టించుచున్నది. రామాయణమునందు వర్ణింపఁబడిన నావరూపాదులంబట్టి చూచినను, ఆచారాదులంబట్టి విచారించినను, నాగరకతాదుల ననుసరించి యోజించినను రామాదులు నరులనియు, సుగ్రీవాదులు వానరులనియు, రావణాదులు నరాశనులనియు, వీరు మువ్వురు వేఱువేఱు జాతులవారనియు కరతలామలకముగాఁ దెలియగలదు. ఇట్లుండగా రావణాదులును సుగ్రీవాదులును గూడ శబరులేయనియు, వారిభాష శబరభాషయే యనియు వ్రాయుట వింతను బుట్టించుచున్నది.

"సవరలు, గదబలు, అసురులు, ముండారీలు, మొదలైనవారందరూ ఒక్కజాతిలోనివారే యని శ్రీ గ్రియర్సన్ దొరగారు నిర్ధారణచేసిరి."

అని రామదాసుగారు వ్రాసిరి. గ్రియర్సన్ దొరగా రుదాహరించిన అసురులు మధ్యహిందూస్థానమునందుఁగల యాటవికులుగాని పూర్వకాలమునందు లంకలోఁ బరిపాలించిన యసురులు కారు. అసుర నామమున్నంతన మన నవనాగరకు లిప్పుడు చెప్పు ననార్యజాతిలోఁ బడవేయ వలనుపడదు. సరస్వతి యసురగా వేదములందే తెల్పఁబడియున్నది. ఇంతమాత్రముచే నామె ననార్యజాతిలోనిదానిఁగా నెంచవచ్చునా? రావణుఁడు బ్రహ్మపౌత్రుఁడని తెల్పఁబడియున్నది; అనగాఁ బ్రహ్మకులుఁడే. అతనిభాష సంస్కృతము. ఈయంశము హనుమద్వాక్యములవలన నిదివఱకుఁ దెల్పఁబడియే యున్నది. అశోకవనమునం దున్న సీతతో సంభాషింపఁ బోవునప్పుడు హనుమ యేభాషతో ముచ్చటింపవలెనని శంకించుకొని సంస్కృతమున ముచ్చటించిన రావణుఁడని తలంచును గావున నట్లు చేయ వలనుపడదని భావించెను. దీనింబట్టి సంస్కృతము రావణుని సహజభాషయని తేలుచున్నది. ఇంతియేకాక రావణుఁడు పెద్దవేదవేత్త. ఒక్క రావణుఁ డననేల? "అగ్నిహోత్రాశ్చ వేదాశ్చ రాక్షసానాం గృహే గృహే" అని చెప్పఁబడి యున్నది. కాన రావణుఁడు మనవా రిప్పుడు విభజించి చెప్పు నార్యభాష కలవాడు, ఆర్యాచారములు కలవాఁడు, ఆర్యనాగరికత కలవాఁడు కావున రావణుని శబరజాతివానిగా నెంచుట యనుచితము.

## భ్రాతృత్వ ప్రశంస

హనుమ రావణునితో నీ భ్రాతయగు సుగ్రీవుఁడని పలికెనఁట.

"అహం సుగ్రీవసందేశా దిహ ప్రాప్త స్తవాలయమ్;
రాక్షసేశ! హరీశ స్త్వాం భ్రాతా కుశల మబ్రవీత్."
—సుందర. ౫౧, ౨.

ఆహేతువుచే రావణుఁడును, సుగ్రీవుఁడును నొక్కజాతివారే యని మన రామదాసుగారు తలంతురఁట! ఇది గొప్పచోద్యము. సార్వలౌకికసౌభ్రాతృత్వముం గూర్చి (Universal brotherhood) విశేష చర్చ జరుగుచుండు నిక్కాలమున భ్రాతృపదప్రయోగమాత్రముచే జాతియొక్కటేయని నిర్ణయింపఁబోవుట వింతకాదా? మనవార లిప్పుడు మహమ్మదీయులు, ఆంగ్లేయులు మున్నగువారిని 'సోదరులారా' యని పిలుచుచున్నారు. అంతమాత్రముచే వీరెల్లరు నేకజాతివా రగుదురా? అట్లే పైవిషయమును తీసికొనవలెను. సార్వలౌకిక సౌభ్రాతృత్వ మనునది పూర్వకాలమునందును కలదు. కాన నాకాలమున స్వేతరజాతులవారినికూడ మర్యాదకొఱకై భ్రాతలని పలుకుట కలదు. అట్లు కాదందురేని మనరామదాసుగా రార్యజాతిలోనివాఁడని భావించు శ్రీరాముఁడుకూడ శబరజాతిలోనివాఁడే కావలసివచ్చును. ఎందుచేతనన, శబరజాతివానినిగా మన రామదాసుగా రెంచు నాంజనేయుని శ్రీరాముఁడు సోదరాయని పిలిచియున్నాఁడు. సోదరశబ్దప్రయోగముచే జాతియొక్కటియనిచెప్పునెడల రామాయణమునఁ దెల్పఁబడిన వారెల్లరును నొక్కజాతివారే యగుచున్నారు. కాన రామదాసుగారివాద మసంగతము. రాక్షసులు వేఱు; వానరులు వేఱు; నరులు వేఱు. రావణుఁడు బ్రహ్మకులుఁడగు నార్యజాతివాఁడు కాని మనవారు

తలంచు నవార్యజాతిలోనివాఁడు కాఁడు. కావున నత నికిఁ బిల్లిగోత్రము తగిలించుట యసంగతము. న్యాయ ముచేఁ బిల్లిగోత్ర మనునది కలదని చెప్పుటకే యవకా శము కాన్పించుటలేదు. పిల్లిగోత్ర మనునది పూర్వము శబరులలో నుండెడిదేమోయని రామదాసుగా రూహిం పఁజొచ్చిరి. ఆయూహ కాధార మేదియు లేదు. కాన మన రామదాసుగారు శబరులలోని 'రామేక్' శబ్దమున కును, రావణశబ్దమునకును ముడిపెట్టఁజూచుట సర్వవిధ ముల నసంగతము. ఇంతకంటె 'రామేక్' శబ్దమునుండి రామశబ్దము పుట్టినదనినను గొంతబాగుండునేమో! అందు ధ్వనిసాదృశ్యము హెచ్చుగాగలదు. రావణశబ్దవిషయమున నదియును లేదు. రామదాసుగారు రేయేశబ్దములంబట్టి వానర భాష శబరభాషయని బుజువుచేయఁ బ్రయత్నించిరో యాశబ్దములంగూర్చి మనమిందు విపులముగఁ జర్చించు కొనియున్నాము. ఈ చర్చవలన రామదాసుగారు రా మాయణస్థపదములకు శబరభాషాసంబంధము బలాత్కా రముగాఁ దెచ్చిపెట్ట విపరీతప్రయత్నము చేసి సత్యమునకు దూరమగు వ్రాఁతను వ్రాసిరని తేలుచున్నది. వానరుల భాష శబరభాష యనుటకుఁ దగిన బుజు వేదియు లేదు. ఏవో కొన్ని ధ్వనులపోలికనుబట్టి మన రామదాసుగారు కల్పించినరీతిగా మన యపూర్వకల్పనములకు చోటిచ్చి వారి భాష యేదో నిరూపింపఁ బ్రయత్నింతుమేని లోక మునంగల భాషలలో నాంగ్లము, తురుష్కము, కర్ణా ట్యము, ఫ్రెంచి మున్నగు భాషలతోఁగూడ సంబంధము కల్పింపవచ్చును. కాన రామదాసుగారు వ్రాసినదాని యందు విశేష మేదియును లేదు. అయినను ఒట్టుపట్టి శబరులతో వానరులకు సంబంధము కలుప మన రామదా సుగారేల ప్రయత్నించిరన వానరులు వానరులు కార నియు, వారికిఁ దోఁకలు లేవనియు రూఢిచేయుటకై వీ రీయత్నిరి.

## వానరు లెవరు?

శ్రీమద్రామాయణమున వర్ణింపఁబడిన వానరదేహా దుల స్థితిగతులంబట్టిచూడ వారు పరిపూర్తినందిన మానవ దేహము కలవారు కారనియు, మానవత్వ మర్కటత్వము లకు మధ్యజాతివారుగాఁ గాన్పించుచున్నారనియు నే నిదివఱకే వ్రాసియున్నాను. వానరులు శబరులై యున్న యెడల శబరింగూర్చి ముచ్చటించుచున్న రామాయణ మా శబరికిని, వానరులకును సంబంధమున్నట్లు చెప్పియే యుం డును. కానను వానరులకును, శబరులకును సంబంధము కలుపరాదు.

## వానరశబ్దపర్యాయములం గూర్చి:

రామాయణమునందు రామాదులు నరులుగను, సుగ్రీవాదులు వానరులుగను రావణాదులు రాక్షసులు గను వర్ణింపఁబడియుండిరని ఇదివఱకే వ్రాసియున్నాను. నరశబ్దపర్యాయములన్నియు రామాదులవిషయమునను, వానరశబ్దపర్యాయములన్నియు సుగ్రీవాదుల విషయ మునను, రాక్షసశబ్దపర్యాయములన్నియు రావణాదుల విషయమునను మన రామాయణమున వాడఁబడియున్నవి. దీనింబట్టి సుగ్రీవాదుల రామాయణకర్త శబరాదినరులుగాఁ గాని, అసురాది రాక్షసులుగాఁగాని యెంచలేదని తేలు చున్నది. క్రోఁతి యను నర్థమిచ్చుపదములే సుగ్రీవాదుల విషయమున సదా వాడఁబడి యున్నవి.

"కోఁతి యని యర్థమిచ్చే పదములలో కొన్ని మాత్రమే రామాయణమున ఉపయోగింపబడియున్నవి."

అని రామదాసుగారు వ్రాసిరి. ఇది యంతగా సత్యమగు వ్రాఁతగాఁ గాన్పింపదు. వానరపద పర్యా యము లమరమునం దీక్రిందిరీతి నీయఁబడియున్నవి:

"కపి ప్లవంగ ప్లవగ శాఖామృగ వలీముఖాః, మర్కటో వానరః కీశో వనౌకాః" అని. వీనిలో వలీముఖ మర్కట కీశశబ్దములు తప్ప తక్కిన వన్నియు రామాయణమున వాడఁబడియున్నవి. మరియు నీనిఘం టువునందు లేని హరి, వనచార, వనకోవిద, కాననౌక సశబ్దములుకూడ రామాయణమునందుఁగాన్పించుచున్నవి. కాన కోఁతి యను నర్థమిచ్చు పదము లించుమించుగా నన్నియు రామాయణమున వాడఁబడిన వనఁదగినదికాని కొన్నిమాత్రమే వాడఁబడిన వనఁదగదు. ఈవిషయమై రామదాసుగారే యిట్లు వ్రాసిరి:

"'వానర' అనుపదము ౧౦౪౦ సార్లున్ను, హరి, ౨౩౨ సార్లు, కపి, ౪౧౧ సార్లు, 'ప్లవంగ' ౨౩౬ మార్లు, 'శాఖామృగ' ౨౨ సార్లు, 'వనచార' ౯ పర్యా యములు, 'వనకోవిద' ౧ మారు, 'వనౌకస' ౪౪ సార్లు,



శివగంగాతటాకము [౨]—తంజావూరు

'కాననౌకస' 8 సార్లు వాడబడియున్నవి. 'మర్కట' అనుపదము ఒక్కసారియైనను ఉపయోగింపలేదు. కాన స్వల్పముగావాడిన పదములు ప్రాసకొఱకు, ఛందస్సు కొరకు ఉపయోగించినట్లు అగుపడుచున్నవి."

"విశేషపర్యాయపదములు ఉపయోగించబడిన పదముల నెట్లు సమర్థించవచ్చును? వనమునందుండేవారు గాన వానరులైరి. కొన్నిచోట్ల కవియే 'వానర' అనుపదమును 'వనచారి' అనుపదముచే వారిని నిజస్వభావమును దెలియజేసెను. వేగముగా పరుగెత్తేవారు గాన 'ప్లవంగమ' పదము సార్థకమైనది."

సుగ్రీవాదులవిషయమున రామాయణమున వాడఁబడిన వానరాదిశబ్దము లన్నియు సార్థకము లని చూప వచ్చునని వీరు వ్రాయించిరి. ఇది వింతను బుట్టించుచున్నది. వాల్మీకివంటి మహాకవి సార్థకములుగాని వ్యర్థపదములఁ దన కావ్యమున వాడునా? సార్థకము లనగా మానవపరముగా సార్థకములని రామదాసుగారి తాత్పర్యమేమో? అయినను నట్లు తెల్పుటకును నవకాశము కానిపించుటలేదు. 'వనమునందుండేవారు గాన వానరులైరి' అని రామదాసుగారు వ్రాసిరి. ఇదితప్పు. వనమునందుండువారు వనస్థులగుదురు గాని వానరులు కారు. శబ్దశాస్త్రము నెఱిఁగినవార లీశబ్దమునకు రెండర్థంబులం దెల్పిరి. 1. (వా + నర)వా-పక్షముచేతనైన నరులు— అనగా నరులకంటె తక్కువవారు. 2. (వాన + ర) వన సంబంధములగు ఫలాదులను గ్రహించువారు. శబ్దశాస్త్రముంబట్టి యీ యర్థములుమాత్రమే వచ్చునుగాని వనమందుండువారు అను నర్థమురాదు. ఈ యర్థము నిమిత్తమైయే రామాయణమున వానరశబ్దము వాడఁబడి యున్న యెడల నయ్యది వనమునందుండు మునులు, సింహాది మృగములు, రాక్షసులు మున్నగువారిని దెల్పుటకుఁగూడ నందువాడఁబడియే యుండును. అట్టియర్థమిచ్చునట్లుగా నీశబ్దము వాడఁబడకపోవుటయే కాక సుగ్రీవాదిజాతి నొక్కదానిని దెలుపుటకే యివి వాడంబడి యున్నవి. కాన వనమునందుండువారను నర్థమిచ్చుటకై ఈపదము రామాయణమున వాడఁబడెనని తెలుపు టసంగతము.

ఇంకను శాఖామృగాది శబ్దములు తక్కువపర్యాయములువాడఁబడెననియు, కాన నవిప్రాసకొఱకో, ఛందస్సుకొఱకో వాడబడినవిగా గ్రహింపవలెననియు వీరు వ్రాసిరి. కాని యిదియు నసంగతమే. ఇది తెలుఁగు కావ్యము కాదు. సంస్కృతకావ్యము. ప్రాసాదు లిందు ప్రధానములు కావు. ఇందున్న ఛందస్సైనను విశేషముగ నక్షరనియమములగల వృత్తములతోఁగూడినదిగాదు. కాన ఛందస్సునకై కక్కురితిపడ నవసరములేదు. కాన శాఖామృగాదిశబ్దములు నిరర్థకముగా ప్రాసముకొఱకో, యతికొఱకో, ఛందస్సుకొఱకో వాడంబడినవి గావు. అవి సార్థకములే. అనఁగా వానరులందుగల మృగత్వాది లక్షణములను దెల్పునవియే. గ్రంథవిస్తరభీతిచే శాఖామృగశబ్దముంగూర్చిమాత్ర మిచ్చట వివరించుచున్నాఁడను. శాఖామృగశబ్దము రామాయణమునందలి వానరులు మృగము లనుభావము రూఢిచేయుటకయి వాడఁబడియున్నది. చాటుననుండి తన్నుఁగొట్టినందులకై వాలి నిందింప శ్రీరామచంద్రుఁ డీక్రిందిరీతిని సమాధానము చెప్పియున్నాఁడు.

"యాంతి రాజర్షయ శ్చాత్ర మృగయాం ధర్మకోవిదాః,
తస్మా త్త్వం నిహతో యుద్ధే మయా బాణేన వానర!
అయుధ్య న్ప్రతియుధ్య న్వా యస్మా చ్ఛాఖామృగో
[హ్యసి. ౪౧.—కిష్కింధ-౧౮.

(ధర్మమును నెఱింగిన రాజర్షులు మృగములను జంపుటకు వేటాడుచున్నారు. అందుచేత నీవు శాఖామృగమవగుటచే నీవు యుద్ధముచేసినను చేయకపోయినను నిన్ను బాణముతోఁ గొట్టిచంపితిని.)

దీనింబట్టి వానరులు నరులుకారనియు మృగములలోఁ జేరఁదగినవారనియుఁ దెలుపుటకై కవి యిచట శాఖామృగశబ్దమును వాడినాఁడని తేలుచున్నది. కిష్కింధాకాండమందు రామాదులనుగాంచి జంకుచున్న సుగ్రీవునిఁగూర్చి హనుమంతుఁడు పల్కిన

"అహో! శాఖామృగత్వం తే వ్యక్తమేవ ప్లవంగమ;
లఘుచిత్తతయాఽఽత్మానం నస్థాపయసి యోమతౌ"
—౨ సర్గ. ౧౮ శ్లో.

శ్లోకములవలనఁగూడ వారల బుద్ధిహీనతగల మృగత్వము తేటపడుచున్నది. మర్కటశబ్దమును కవి వాడలేదనియు, నట్లు వాడకుండుట తమకనుకూలమనియు, రామ

దాసుగారు లిఖించిరి. అది యయుక్తము. వానరాది శబ్దములు సుగ్రీవాదులజాతి నెంతవఱకుఁ దెలుపునో యంత వఱకే మర్కటశబ్దమును దెలుపును దీనియందుఁగల విశేష మేదియును లేదు. ఇంతయేల రామాయణకర్త వానరులు క్రోఁతులని తెలుపఁదలఁచినాఁడని మనరామదాసుగారే తుద కంగీకరించి యీక్రిందరీతిని వ్రాసిరి. "ఇట్లు అన్ని పదములు సార్థకములే యని చూపవచ్చునుగాని 'కపి' అను పద మెట్లు సార్థకమగును" ఈకపియనుపదము వాడఁబడి యుండుటచే రామాయణమునందలి వానరులను క్రోఁతులనుగాఁగవి వ్రాసెనని మన రామదాసుగా రంగీకరించిరి. ఏవిధముచేతనైన నేమి, తుదకు సుగ్రీవాదులు క్రోఁతుల కుండు లక్షణములు కలవారుగా నున్నారని మన రామదాసుగా రంగీకరించితీరవలసివచ్చినది. ఆ వానరలక్షణమే పనః తోఁకగలిగియుండుటయనియు, మన రామదాసుగా రంగీకరించియునుగూడ మరల రామాయణస్థ వానరులకుఁ దోఁకలున్నవనినందులకై నన్నిట్లు పరిహసించిరి.

"ఈవానరులకు తోఁకలున్నవని స్థాపించుటకు శ్రీ శాస్త్రిగారికి ఆధారము బెషూనాల్యాండులో దొరకిన పుస్తకమొకటిన్ని, బార్నియో అడవిలోనున్న ఒకజాతి మనుష్యులునఁట! అట్టి పుచ్ఛలుగల మానవజంతు వొకటి యుండియుండవచ్చును. చిన్న చిటికెనవ్రేలంత తోఁకగలిగిన మానవజంతువులు ఉండవచ్చును. కాని, ఆ యాధారముపైన రామాయణమునందు వర్ణింపఁబడినవానరులకు నిజమైన వాలములున్నవని స్థాపించు టెట్లు?"

రామదాసుగా రిట్లు వింతలపై వింతలు వ్రాయుచున్నారు. రామాయణమునందలి వానరులకు నిజమైన తోఁకలున్నవని స్థాపించుటకు నాకు బెషూనాల్యాండులో దొరకిన పుస్తకమొకటిన్ని, బార్నియో అడవిలో నున్న ఒకజాతిమనుష్యులు నాధారమంట! ఇది విచిత్రపు వ్రాఁత. బెషూనాల్యాండులో దొరకిన పుస్తకమయినను, బార్నియో అడవిలోనున్న ఒకజాతి మనుష్యులును రామాయణమునందలి వానరులకుఁ దోఁకలున్నవనుటకై నాకు మూలాధారమై యుండలేదు. శ్రీమద్రామాయణమే నా కందులకు మూలాధారము. దానినిఁబట్టియే సుగ్రీవాదులకుఁ దోఁకలుగలవని యస్మదాదులము తెలుపుచుంటిమిగాని యొక్కడనుండియో లేనిపోనికారణముల దెచ్చికాదు. రామాయణస్థవానరులకుఁ దోఁకలుగలవనుటకు మాకుఁగల ముఖ్యాధారము శ్రీమద్రామాయణమే యని రామదాసుగారు తెలిసికొందురుగాక! వాల్మీకి చెప్పని తోఁకల నేను జెప్పలేదని గ్రహించుకొందురుగాక! వానరులకుఁ దోఁక లున్నవన్నందులకై నన్నుఁ బరిహసింపఁబోయిన శ్రీరామదాసుగారు తుదకేవో తోఁకలు తాము చెప్పు శబరవానరులకుఁగూడఁ గలవని యంగీకరింపవలసినవారయిరి. ఈవిషయమై వారిట్లు వ్రాసిరి:

"సవరవారలలో నొకజాతికి 'కోఁతు'లని వారి భాషానామ మొకటియున్నది. 'అర్సి' లేక 'అరిశి' అనగా సవరభాషలో 'కోఁతి' అని యర్థము. వీరికి సామీప్యములో ఉండు ఓఢ్రులు ఈ 'అర్సి' జాతివారిని 'లంబో లంజియా' (పెద్దతోఁక గలవారు) అని పిలుతురు.

"A tribe of savaras is called Arsi or arisi which means a monkey in the language of the Savaras. By their Oriya neighboars they are called 'Lambo Lanjia. (Long tailed) which is the Oriya equivalent to Arsi. They got the name from a long piece of cloth which the males allow to hang down.—(Castes and tribes of S.India, Thurston.)

ఈ అర్సి అనునామము మొగవారి బట్టకట్టువలన ఆజాతికి వచ్చినది." అనియు,

"రామాయణమునందు చెప్పియున్న వానరులు వీరు. కొండలపైనుండు సవరలు వీరలలో మొగవారు బట్టకట్టినప్పుడు తోఁక వదులుదురు గాని వీరికి 'అర్సి' (కోఁతి) జాతియని పేరు వారివారే చెప్పుదురు. నేటికిగూడ ఈజాతివారట్లే తోఁకవలె బట్టకట్టుదురు. గవర్నమెంటు లెక్కలలో సహిత మీజాతివారికి 'లంబో లంజియా' జాతియని ఓఢ్రపునామము వ్రాసియున్నది. ఆకాలములోగూడ నిటువలెనే 'అర్సి' అను సవరనామములకు 'కపి' అని సంస్కృతములోనికి మార్చి చెప్పిరే కాని వారు నిజముగా తోఁకలుగల కోఁతులుగారు" అనియు మనరామదాసుగారు లిఖించియుండిరి. రామాయ

ణమునందలి వానరులకుఁ దద్దేహాంగములగు చర్మవాలములు గలవని నేను వ్రాసినాను. అట్లు వ్రాయుటకు నాకుఁ గల యాధారము శ్రీమద్రామాయణము. మన రామదాసుగారు రామాయణస్థ వానరులకు దేహాంగములగు చర్మవాలములు లేవనియు, వారు గుడ్డతోఁకల (గోఁచీల) ధరియించెడివారనియు, కావునఁ గపినామము గలవారైరనియు లిఖించిరి. ఇందులకు వారికిఁగల మూలాధార మిప్పటి సవరలంగూర్చి Thurston దొర వ్రాసిన వ్రాఁతలు. తెల్లదొర వ్రాఁతల నాధారముచేసికొని రామాయణస్థవానరులకు గుడ్డతోఁకలఁ దగిలించిన మన రామదాసుగారు వాల్మీకి రామాయణముం బట్టి వానరులకు దేహాంగములగు సత్యవాలములు కలవనిన నన్ను నీవే యాధారముంబట్టి యట్లు వ్రాసితివని శంకింపఁజొచ్చిరి. Thurston దొరగారైనను నీగుడ్డ త్రోఁకలుగల 'అరిశి' యను పేరుగల శబరులే రామాయణస్థవానరులని వ్రాసియుండలేదు. ఇక్కాలపు శబరులలో 'అరిశి' నామకమగు తెగకు గుడ్డతోఁక లుండుటచే వారి 'అరిశి' అనగా క్రోఁతుల పేరు వచ్చినదని వారు వ్రాసిరి. ఇట్టి పేరినిఁ దీసికొనిపోయి మన రామదాసుగారు రామాయణస్థవానరులఁ గావించిరి. కావున, రామాయణస్థవానరులకు గుడ్డతోఁక లుండెడివని తెలుపుటకుఁ దుస్సాహసమే యాధారము గాని మఱియే యితరాధారమును లేదు. ఇక్కాలమునఁ గోఁతి యనునర్థమిచ్చు 'అరిశి' యను శబరజాతియొకటి యుండుఁగాక! ఆజాతివారికి వారిలోని మగవారు ధరించు గుడ్డతోఁకలంబట్టి వారికా పేరు వచ్చుఁగాక! వీరే రామాయణస్థ వానరులనుట కాధారమేది? ఏదియును లేదు. రామాయణస్థవానరులఁ దెలుపుటకై కవి యెచ్చటనైన 'అరిశి' పదమునుగాని, 'లంబోలంజీయూ' పదమును గాని యాపదముల సంస్కృతరూపములనుగాని వాడియుండిన యెడల వీరే వారనుటకు అవకాశ ముండియుండును. అట్టిపదములను నేనిని వాల్మీకి వాడియుండలేదు. దక్షిణాపథమునందు నివసించువారినిగూర్చి తెలియఁజేయునపుడు తద్భాషాపదములనే వాడుట వాడుక అయియును, అట్టివి రామాయణమునందుఁ గలవనియునుగదా మన రామదాసుగారు వ్రాసియున్నారు. గుడ్డతోఁకలు ధరించిన కారణమున (గోఁతి) 'అరిశి' యను పేరుతో వ్యవహరింపఁబడుచున్న సవరలే యున్నయెడల వారే శ్రీమద్రామాయణస్థవానరు లనుతలం పున్నయెడల వారిభాషలో వారికున్న వ్యావహారికనామము నొక్కసారియైన నెత్తకుండునా? కావున గుడ్డతోఁకలు ధరించినకారణమునఁ గోఁతులని పిలువఁబడిన 'అరిశి' యను సవర తెగవారే రామాయణస్థవానరులనుటకు నవకాశ మింతయుఁ గాన్పించుట లేదు. ఈ 'అరిశి' యను సవరలు తాము సుగ్రీవాదుల సంతతివారమని చెప్పుకొనుచున్నట్లును గానరాదు. 'Thurston' దొర దక్షిణదేశవాసులంగూర్చి తాను వ్రాసిన గ్రంథములో 'అరిశి' యను సవరలు గుడ్డతోఁకలు ధరింతురు కావున క్రోఁతులని పిలువఁబడుదురనియు, వారి నోద్ధులు 'లంబోలంజీయూ'లందురనియు వ్రాసెనే కాని ఈ 'అరిశి' తెగవారు తాము సుగ్రీవాదుల సంతతివారమని చెప్పుకొందురని వ్రాయలేదు. అట్టి వాడుక కలదని సూచించుటకైన మన రామదాసుగారి కవకాశము చిక్కలేదు. కాన నీ 'యరిశి' తెగవారికిని రామాయణస్థవానరులకును సంబంధముకలదనుట యసంగతము.

మొహరం పండుగలో రంగుతోఁ బులివారలు దాల్చి కాగితపుఁదోఁకల ధరించి పులి యనిపిలువఁబడువారు నిజమైన పులులతో సంబంధముకలవారని యెట్లు తెలుపఁగూడదో గుడ్డతోఁకలఁ గట్టుకొని కోఁతుల మనువారిని గూడ పూర్వపువానరులని యట్లే తెలుపరాదు. వీరిని బట్టి రామాయణస్థ వానరులతోఁకలును గుడ్డతోఁకలే యనుట మహాసాహసము కాదా?

## రామాయణస్థవానరులతోఁకలు గుడ్డవియా?

రామాయణస్థవానరులవాలములు సహజములుగాక కృత్రిమములనికాని, గుడ్డవి యనికాని రామాయణము తెలుపుచున్నయెడల నప్పుడు రామాయణస్థ వానరులకును 'అరిశి' యనుపేరుగల సవరలకును సంబంధము కలదని చెప్పవచ్చును. కాని రామాయణముంబట్టి చూడ సుగ్రీవాదుల వాలములు గుడ్డలతోఁ జేయఁబడిన కృత్రిమ లాంగూలములుగాఁ గానిపించుటలేదు. సరికదా వారి దేహావయవములగు సహజవాలములుగాఁ దెలుపఁబడియున్నవి. వారు తమవాలములఁ బైకి నిక్కఁబొడిచినట్లు ముడిచినట్లు ఒకదానికిఁ జుట్టినట్లు, లాగినట్లు, పెక్కులకు వానితో ననేకకార్యములు చేసినట్లు తెలుపఁబడియు

న్నది. హనుమ లంకనుండివచ్చి సీతను జూచితినని చెప్పిన తోడనే అంగదాదులు సంతోషముచే నీ క్రిందిచేష్టలు చేసినట్లు తెలుపఁబడియున్నది.

"కేచిదుచ్ఛ్రితలాంగులాః ప్రహృష్టాః కపికుఞ్జరాః;
అంచితాయతదీర్ఘాణి లాంగులాని ప్రవివ్యధుః."

ఇది వినినతోడనే కొందఱువానరులు తోఁకల నిక్కఁబొడిచి సంతోషముతో నిండిన మనస్సుకలవారై తమపొడవైన తోఁకలను గదలిచిరి. వానరుల తోఁకలు దేహావయవములుగాక గుడ్డవి యగుచో వానిని వారట్లు చేయలేరు గదా! దీనిఁబట్టి వాలము వీరికి సహజమైన యంగముకాని కృత్రిమముగాదని తెలియవచ్చుచున్నది. రావణుఁడు హనుమతోఁకను దహింపఁజేసినదని యీ క్రిందిమాటలతోఁ దెలిపెను.

శ్లో. కపీనాం కిల లాంగూల మిష్టం భవతి భూషణమ్;
తదస్య దీప్యతాం శీఘ్రం తేన దగ్ధేన గచ్ఛతు.
తతః పశ్యం త్విమం దీన మంగవైరూప్యకర్శితమ్.
సమిత్రజ్ఞాతయ స్సర్వే బాంధవా స్ససుహృజ్జనాః.
—సుందరకాండ.

(వానరులకు వాలములన నిష్టమెక్కుడుకాన వీరి వాలము తగులఁబెట్టవలసినది. అంగవైకల్యము గలిగి దీనుఁడై యుండు వీనిని బంధువులు మిత్రులు మున్నగువారు చూతురుగాక! అని దీని తాత్పర్యము)

ఇందు వాలము దేహాంగమని తెలుపఁబడియున్నది. ఇది గుడ్డతోఁకయే యగునెడల వానికి సహజమగు నంగవైకల్యమెట్లు కలుగఁగలదు? దానఁ దానెట్లు దీనుఁడు గాఁగలఁడు? గుడ్డతోఁకయే యగునెడల నొకటి పోయిన మఱియొకటి సంపాదించుకొని యుండఁగలుగును గదా! అదిగాక యాంజనేయుని పుచ్ఛము గుడ్డదియే యగుచో దానిఁ దగులఁబెట్టుటకై వేఱుగ గుడ్డలఁ జుట్టఁ బెట్ట నవసరము లేదు. ఆ గుడ్డవాలమును జమురులో ముంచి యంటించిన నిమిషములో దగ్ధమయిపోవును గదా! రాక్షసు లట్లుచేయక కేసరీనందనుని వాలమునకు జీర్ణవస్త్రములనుజుట్టి చమురులో ముంచి యంటించిరి.

"వేష్టయంతి స్మ లాంగూలం జీర్ణైః కార్పాసకైః పటైః;
సంవేష్ట్యమానే లాంగూలే వ్యవర్ధత మహాకపిః.
శుష్క మింధన మాసాద్య వనే ష్వివ హుతాశనః,
తైలేన పరిషిచ్యాథ తేఽగ్నిం తత్రాభ్యపాతయన్."

దీనింబట్టికూడ హనుమంతుని వాలము కార్పాస పటకల్పితమైన కృత్రిమము కాదనియు సహజమైన దేహావయవమనియుఁ దేలుచున్నది. కావున దేహావయవమగు వాలముగల సుగ్రీవాదులకును, కృత్రిమమగు కార్పాసవాలమును దగిలించుకొని కోఁతులనిపించుకొనిన 'ఆరిక' యను సవరలకును ఏవిధమగు సంబంధమును లేదు. ఇప్పుడున్న జాతులవిశేషములఁ బరికించిచూడఁ గిష్కింధావాసుల సంతతివారమని చెప్పుకొను జాతులుకూడఁ గాన్పించుచున్నవి.

ఈవిషయమై 'Tylor's primitive culture' అను గ్రంథములో నిట్లున్నది:

"The Jaitwas of Rajputana, a tribe politically reckoned as Rajputs, neverthe less trace their descent from the monkey God Hanuman and confirm it by alleging that their princes still bear its evidence in a tail like prolongation of the spine, a tradition which has probably a real ethiological meaning pointing out the Jaitwas as ifNon-Aryan race"—

దీనింబట్టి రాజపుత్రస్థానమందుఁగల జైత్వాలనఁబడు రాజపుత్రులు తాము హనుమంతుని సంతతివారమని చెప్పుకొందురనియు, నందులకుఁ దార్కాణముగాఁ దమ ప్రభువుయొక్క వెన్నెముక తోఁకలాగుండునట్లు ముందునకు సాఁగియుండునని చెప్పుదురనియుఁ దేలుచున్నది. దీనింబట్టి యేదో తోఁకను గల్పించుకొని రామాయణమునందలి కిష్కింధాపురస్థులతో సంబంధము కలుపుకొనుజాతులు కొన్ని మనదేశమున గలవని తేలుచున్నది. ఇందువలన రాజపుత్రస్థానమందలి జైత్వాలు రామాయణస్థవానరులనుచున్నారు. ఆవానరులు సవరలని తెల్ప రామదాసుగారు ప్రయత్నించుచున్నారు. ఆవానరు లాంధ్రులని తెల్ప చిలుకూరి వీరభద్రరావుగారు ఉద్యమించుచున్నారు. వారివారి యూహలనుబట్టి రామాయణస్థ వానరులు వివిధజాతులక్రింద మారిపోవుచు

స్నారు. ఇవన్నియు నిటీవలివారికల్పనములు. మనము నమ్మఁదగినవి కావు.

## రామాయణస్థ వానరులకును, సవరలకును గల యితరసంబంధములు

రామాయణస్థ వానరులకును, సవరలకును భావ మొక్కటియేయని ఋజువుచేయ మన రామదాసుగారు యత్నించిరి; కాని ఆవాద మెంతమాత్రమును దృష్టికరముగ లేదు. నేను పైనచేసిన చర్చవలన నిది తేలుచునే యున్నది. ఇంక గడ్డలో (కలఁదాల్చు సవరలే ('అరిశి' తెగవారే) రామాయణస్థ వానరు లనుటకై మఱికొన్ని యత్నములఁ జేసిరి. వాని నీక్రింద విమర్శించు చున్నాఁడను.

## రామాయణస్థ వానరస్త్రీలకుఁ దోఁకలు లేవా?

'అరిశి' తెగసవరలలోఁ బురుషులుమాత్రమే గుడ్డతోఁకలను ధరింతురఁట! శ్రీమద్రామాయణమునఁగూడఁ బురుషులకుమాత్రమే తోఁకలున్నట్లు తెల్పఁబడె గాని స్త్రీలకున్నట్లు తెల్పఁబడలేదఁట. ఆహేతువుచే నీ'అరిశి' తెగవారే రామాయణస్థ వానరులనిమనరామదాసుగారు భావింతురఁట! ఇదిపెద్ద వింత. ఏమన, రామాయణము నందుఁ బురుషులకుమాత్రమే లాంగూలము లున్నవనియు స్త్రీలకు లేవనియుఁ దెలుపఁబడియుండలేదు. రామకథతో సంబంధించునంతవఱకే వానరులకథ రామాయణమునఁ బూర్వభాగమునఁ దెలుపఁబడెఁగాని తత్ప్రత్యేకచరిత్ర వ్రాయుటకై కాదు. కాన శ్రీరాముని వ్యవహారముతో సంబంధముగల పురుషులచరిత్రమే విశేషముగా నందుఁ దెల్పఁబడె కాని స్త్రీలవిషయ మంతగాఁ దెల్పఁబడియుండలేదు. అందుఁ దారయొక్కతెయే ప్రవేశపెట్టఁబడినది కాని తక్కిన స్త్రీ లెవరును బ్రవేశపెట్టఁబడలేదు. తారావిషయము తెలుపుచోట వాలము గలదని తెల్పనవసరము లేకపోయినది. అందువలనచే స్త్రీలవాలము లందు వర్ణింపఁబడియుండలేదు. రామాయణములో సంబంధములేని సుగ్రీవాదుల పూర్వచారిత్ర ముత్తరకాండమునందుఁ గలదు. దానింబట్టిచూడ స్త్రీలకును వాలములు గలవనియే తేలుచున్నది. ఈవిషయమైన చర్చనంతను నా మొదటివ్యాసమునఁ జేసియే యున్నాను. కావున స్త్రీలకుఁగూడ వాలములు గలవని రామాయణమును బట్టియే తేలుచున్నది. ఐనను నీచిక్కునుండి తప్పించుకొనుటకై మనరామదాసుగారీక్రిందిరీతిని లిఖించిరి.

"రామాయణమునందుగూడ మొగవారికే తోకలున్నట్లు చెప్పియున్నది. కాని ఆడువారికి తోకలున్నట్లు చెప్పలేదు. ఉత్తరకాండలో నెచ్చటనో ఒకదగ్గర యున్నదంటే అది తగిన ప్రమాణము గాదు. ఉత్తరకాండలోని హంశములకును కడమకాండలలోని హంశములకును సరిపోదని ఇదివరకొక నిదర్శనము చూపించబడియె."

ఇది యత్యద్భుతపు వ్రాఁత. ఉత్తరకాండములో వానరస్త్రీలకు గూడ నొక్కచోట వాలమున్నట్లుచెప్పఁబడియున్నదని తా మంగీకరించియును గూడ నదియొకచోటనే తెలుపఁబడియున్నది గావున ప్రమాణముగాదని కొట్టివేయఁ బ్రయత్నించిరి. ఇది మహాసాహసముగాదా? ఉత్తరకాండములోని యంశములకును పూర్వకాండములలోని యంశములకును సంబంధములేదని వీరు వ్రాసిన వ్రాఁతనంతను నేనీవ్యాసమున నిదివఱకే పూర్ణముగా ఖండించి యున్నాను. కాన నుత్తరరామాయణము ప్రమాణముకాదనుమాట యప్రమాణవాక్యము. వానరస్త్రీలకు వాలములు కలవనుటకు నేనుత్తరకాండమునుండి యొక్క ప్రమాణమునైనఁ జూపియున్నాను. వారికిఁ దోఁకలు లేవనుటకు మనరామదాసుగా రొక్క ప్రమాణమునైనఁ జూపఁగలిగియుండలేదు. ఉన్న భాగమును నమ్మమని త్రోసివేసి తోఁకలులేవని తక్కినభాగములు చెప్పకపోయినను ఉన్నవనిచెప్పనంతన లేవని చెప్పుటగా భావించుట యధర్మము. ఎప్పుడు పురుషులకు వాలములు దెలుపఁబడియున్నవో, యెప్పుడు స్త్రీలకు వాలములు లేవని చెప్పఁబడియుండలేదో, అప్పుడు స్త్రీలకుఁగూడ వాలములున్నవని తలఁచుట ధర్మము; కాని లేవని తలఁచుట ధర్మముకాదు. ఏమన: లోకమునంగల జాతులలోఁ బురుషులకు దోఁకలుండిన స్త్రీలకును దోఁకలుండుట చూచుచున్నాము.

పురుషజంతువులకు మాత్రమే వాలములుండి స్త్రీజంతువులకు లేనిజాతు లెచ్చటనుగానరావు. కాన మొదటి షట్కాండములంబట్టి చూచినను, వానరస్త్రీలకు పుచ్ఛ

ము లున్నవని తలఁపవలసిదేకాని లేవని నిర్ధారణముచేయ వలనుపడదు. సత్యరతుల కెల్లరకును నట్లు తోఁపకమాన దు. వానరస్త్రీలు రామునిచే నయోధ్యకుఁ దీసికొనిపోఁ బడినట్లు మనరామదాసుగారు వ్రాసియున్నారు. రావణ సంహారముచేసి లంకనుండి బయలువెడలి యయోధ్యకుఁ జనుచున్న శ్రీరామచంద్రుఁడు కిష్కింధకడఁబుష్పకము నాఁపి వానరస్త్రీలను రప్పించినప్పుడు వారు సీతంగని యీక్రిందిరీతిని సంభాషించుకొనినట్లుగాఁ బూర్వశ్లోక మొకటి కలదు.

> "గాత్రం నరోమశ మనల్పతరేవ నేత్రే
> వక్త్రం నరక్తరుచి సీత్కృతయో న సంతి;
> పుచ్ఛం స తుచ్ఛ మపి కే వ ధరాతనూజా
> సౌందర్యవర్ణనకథా మధికం నదంతి.—(చాటువు)

దీనింబట్టి యీకవి వానరస్త్రీలకుఁగూడ వాలము లుండెడివని భావించెడివాఁడుగాఁ గన్పించుచున్నాఁడు. అట్లు తలంచుట సహజము కావున మొదటి షట్కాండ ములందును వానరస్త్రీలకుఁ దోఁక లున్నట్లు చెప్పఁబడి యుండలేదు. కాఁబట్టి వారి కవి లేవని తలంచుట భావ్య ము కాదు. అదిగాక యుత్తరకాండముం బట్టి వారికిని దోఁకలున్నట్లు తేలుచునేయున్నది. కాఁబట్టి రామాయ ణస్థవానరు 'లరిశి' తెగవంటివారు కారు. స్త్రీలకును బురుషులకునుగూడ సహజములగు వాలము లుండెడివి.

గోలాంగూలుల వాలములు:

రామాయణస్థవానరులకు వాలములు లేవనుటకై మనరామదాసుగారిఁక నొక యత్యద్భుతవాదములోనికి దిగిరి. రామాయణములో గోలాంగూలులను వానరులు తెలుపఁబడియుండిరి. గోలాంగూలులనగా (గో + లాం గూల) గోపుచ్ఛమువంటి పుచ్ఛము గలవారని యర్థము. దీనింబట్టి వారికి పెద్దతోఁక లున్నట్లు తేలుచున్నది. ఈబాధనుండి తప్పించుకొనుటకై మన రామదాసుగా రీక్రిందివ్రాఁత వ్రాసిరి.

'గోలాంగూలాః' అను పదమునకు గోపుచ్ఛము వంటి పుచ్ఛముగలవారని యర్థము. గోవుతోఁకకుకొనను చామరమువంటి కుచ్చుండును. ఇట్టి కుచ్చు కొండముచ్చుల తోఁకలకి ఉండేదే! కాన ఈయర్థము సరిపోలేదు.

సవరలు బహుచిత్రముగా నలంకరించుకొందురు. తలజుట్టు నడినెత్తికి రొత్తి ముడివేతురు. అందులో సాడవాటి పిట్టవెంద్రుకలు పెట్టి కట్టుదురు. అవి లేకుం టే జుట్టుమొదట మాత్రమే ముడివైచి మిగిలిన జుట్టును కుచ్చువలె వ్రేలవేతురు.

నడినెత్తిని ఒక్కచుట్టచుట్టి మిగిలినజుట్టును వ్రేలాడించిన గోపుచ్ఛాకారము స్ఫురించును. కావున 'గోలాంగూలు'లంటే ఇవ్విధముగా జుట్టును వ్రేలాడవేసే సవరవాండ్రని యర్థము."

ఇది విచిత్రపు వ్రాఁత. గోలాంగూలమన గోవు యొక్క తోఁకయని యర్థముగాని దాని చివరనుండు కుచ్చని యర్థముగాదు. లోకములో 'ఆఁ'దోఁకగానున్న దను పద మొకటిగలదు. ఆఁ దోకయనఁగా'ఆవుతోఁక' యని యర్థము. అనగా మొదట లావుగను చివరసన్నము గను ఉండును. కాన నారీతిగా నుండునదియని యర్థ ము. ఆఁదోఁకయన మొదట లావుగను చివరసన్నముగను ఉండునది. గోవాలమన నీ లక్షణమే తేలునుగావున నాఁ దోఁకయనుశబ్దమునకు లోకములో పైయర్థమువచ్చి నది. కాఁబట్టి గోలాంగూలుల న మొదటలావుగను దుదిని క్రమముగా సన్నముగను నుండు దీర్ఘమైన తోఁకగలవా రని యర్థము. ఇదియే సహజమైనయర్థము; కావుననే యట్టితోఁకలుగల కొండముచ్చులు లోకములో బండి తులచేతను బామరులచేతనుగూడ గోలాంగూల శబ్దముచేఁ బిలువఁబడుచున్నవి. కనుక రామాయణస్థ గోలాంగూలు లట్టితోఁకలు గలవారుగాని మన రామదాసుగారు తలం చినట్లుగా నెత్తిపై జుత్తుముడిగలవారుకారు. నెత్తిపై నుండు జుత్తుముడిని లాంగూలమనుటకు నెవరును సాహసింపరు. మన రామదాసుగారెట్లైనఁ బట్టిపట్టి వానరుల సవరలఁ గావింప విశ్వప్రయత్నము చేయుచు న్నారుగానఁ పై విపరీతార్థమును వ్రాసిరి. పెక్కేల! వాలములవిషయమై మన రామదాసుగారు వ్రాసిన దంతయు నసంగతము. 2. రామాయణస్థ వానరులు, సవ రలు నొక్కతెగవారే యనుటకు మనరామదాసుగారు మఱియొక నిదర్శనాభాసమును దెచ్చిరి.

సవరలలో అన్న చచ్చినతర్వాత వానిభార్యను దమ్ముఁడు పెండ్లియాడునేకాని తమ్ముని భార్య నన్న

యెన్నఁడును ముట్టఁడఁట. ఈధర్మమునకు వ్యతిరేకముగా వాలి వర్తించినందున రామునికి వాలిని జంపుట కవకాశము చిక్కినదట. ఇదియు శాస్త్రీయప్రశంసయే. రామాయణస్థ వానరులలో నొకసోదరుఁడు చచ్చిన తరువాత వానిభార్య నిఁక నొకసోదరుఁడుస్వీకరించుటకలదు; కాని పెద్దవానిభార్య చిన్నవానిభార్య యను వివక్ష లేదు. రాముఁడు సుగ్రీవుఁడు బ్రదికియుండఁగా వానిభార్యను వాలి స్వీకరించినందులకు నిందించె నేకాని తమ్ముని భార్యను నన్న యయియుండియును దాను స్వీకరించినందులకుఁగాదు. ఈవిషయమై రామాయణ మిట్లు తెలుపు చున్నది:

శ్లో. అస్య త్వం ధరమాణస్య సుగ్రీవస్య మహాత్మనః;
రుమాయాం వర్తసే కామాత్ స్నుషాయాం పాప
కర్మకృత్.

తమ్ముఁడుజీవించియుండఁగా తమ్మునిభార్యను స్వీకరించితివి కావున నీవు దోషివి. శిక్షార్హుఁడవు అనిదీనిభావము.

దీనింబట్టి తమ్ముఁడు చచ్చినతర్వాత వానిభార్యను అన్న స్వీకరింపవచ్చుననియే తేలుచున్నది. కాన రామదాసుగారు వ్రాసిన దసంగతము.

3. రామదాసుగారిక నొకకారణము నిట్లిచ్చుచున్నారు.

"పైగ్రామాలకు వెళ్లినప్పుడు పగలల్లా యెవరి పనిమీదవారు పోయి రాత్రికి అందరూ ఒక్కచోటనే చేరియుందురు. ఈయలవాటువానరులకుగూడనుండెను.

"విచిత్య దివసం సర్వే సీతాధిగమనే ధృతాః;
సమాయాంతి స్మమేదిన్యాం నిశాకాలేషువానరాః"
—కిష్కింధ. ౪౭-౪.

ఇది సందర్భములేని వ్రాఁత. ఇతరగ్రామములకుఁ దమతమ పనులమీఁదఁబోయినవారెల్లరును బనులసందర్భమునుబట్టియును,పోయినతావుల దూరాదూరములనుబట్టియును నందఱును రాత్రికి స్వగ్రామము చేరుచుందురు ఇది సర్వమానవ లక్షణము. ఒకసవరల లక్షణము మాత్రమేకాదు. ఒక్కచోటనే గుంపుగాఁగూడుటయందు రాయట్లు వానరులు చేసినట్లుగా రామాయణ మెచ్చటను దెలుపుటలేదు. "విచిత్య" అను పైశ్లోకమునందుఁ దెల్ప లేదాయందురేని యది వానరసామాన్యధర్మము కాదు. సీతను వెదకుపనిమీఁద నియమింపఁబడిన వానరులు పగటిపూట విడిపోయి నానాదిక్కులఁబరిశీలించిచూచి రాత్రిపూట నొకదిక్కునఁ జేరెడువారు. కారణమేమి? తమ కులాచారముంబట్టి కాదు. తాము చేసిన పరిశీలన మొకరితో నొకరు చెప్పుకొని ముందు చేయవలసిన పనింగూర్చి చర్చించుకొనుట కట్లు చేరెడివారు. నాల్గువైపులకును బోయినవారిలో నొకవైపున సీత గాన్పింపవచ్చును. నాటిరాత్రి యామెను గాంచిన వారు తక్కినవారితో నాసంగతి తెల్పిన నిక వెదుకవలసిన శ్రమయే తప్పిపోవునుగదా. ఇట్టిపట్ల సర్వజాతులవారును జేయు పనినే వానరులును జేసిరికాని సవరలవలె నటింపలేదు. కాన వీరు వ్రాసినది సందర్భశూన్యము.

4. మఱియొక విషయములో సవరలకును వానరులకును సామ్యము నీక్రిందిరీతిని జూపుచున్నారు.

"ఇప్పటి కొండజనులవలెనే కిష్కింధావాసులు గూడ తంబురా, తముకు మొదలైన వాద్యములతో పాటలు పాడుచుంటూ ఉత్సవములు చేసేవారు.

గీతవాదిత్రనిర్ఘోష శ్శ్రూయతే జయతాంవర!
నర్దతాం వానరాణాంచ మృదంగాడంబరై స్సహ."

గీతవాదిత్రశబ్దములచే తంబుర, తబుకు మాత్రమే గ్రహింపఁబడవు. ఏయేవాద్యములను వానరులు వినియోగించెడివారో దీనివలనఁ దెలియవచ్చుటలేదు. కావున నిందు వారియుభయులకు సామ్యము గుదిరిన దగరాదు.

ఏవిధమునఁ జూచినను సవరలకును రామాయణస్థ వానరులకును సంబంధ మేమాత్రమును గానిపించుట లేదు. రామదాసుగారు, బలాత్కారముగా నట్టిసంబంధమును దెచ్చిపెట్టఁ బ్రయత్నించిరి. అది సమంజసము కాదు. మన రామదాసుగారు వ్రాసిన వ్యాసరాజము వలన నొక్కవిశేషరాజము తేలుచున్నది. అది యేదియన, రామాయణస్థ వానరులకుఁ దోఁకలుండెడివనియు నందుమూలముచే వారు వానరసంజ్ఞనందిరనియుఁ దేలుట. వారితోఁకలు రామదాసుగారు తలఁచినరీతిగా గుడ్డవికావు. సహజములగు దేహావయవములే. ఇట్టి వానరుల బుద్ధివిభవాదులను, సదాచారవ్యవహారాదులను దేహనిర్మా

దాదులనుబట్టిచూడ వీరలిప్పటికి మానవులకును కపుల కును నడిమిజాతివారుగాఁ గాన్పించుచున్నారు. కొంత వఱకు మానవులకుఁ గలిగినట్టి ముఖలక్షణములును, మృగ ములకు గలిగినట్టి లాంగూలాదులును వీరు గలిగియుండు వారు. ఇట్టివారుండుట యసంభవముగాదని ఆఫ్రికా బెష్టూనాల్యాండులో దొరకిన పుఱ్ఱెవలనను, బొర్నియో అడవిలోనున్న తోఁకగల యొకజాతిమనుష్యుల వలనను బోధపడుచున్నది.

రామాయణస్థ వానరులు బుద్ధివిభవాదులచే నరుల కంటె దక్కువవారనుటకు గలకారణములను నా మొదట టివ్యాసములో నిచ్చియే యున్నాను. వానరులు నరుల కంటెఁ దక్కువవారని రామాయణ మసుగడుగు నను దెలుపుచునే యున్నది. వారు ఒకవిధముగా మృగముల లోనివారుగా దెల్పబడినవారనియు బోధించుచున్నది. వాలికిని రామునకును జరిగిన ప్రసంగ మీవిషయ మధి కముగాను వ్యక్తముచేయుచున్నది. ఇట్టిసందర్భము లనే కములు గలవు. నావాదమును నిరసించుటకై రామదా సుగారు "ఆలోచనలో నైతేనేమి, ధైర్యస్థైర్యములలో నైతేనేమి, పరాక్రమమునందైతేనేమి వీరు ఏమానవు నకు తీసిపోదురు?" అని వ్రాయించినను,నవరలలోఁగలిపి వానరలక్షణములను జెప్పుటలో వీరు పిఱికిపంద లని స్వహస్తములోనే యిట్లు వ్రాసిరి.

"పంపాతీరమును వదలి కిష్కింధవైపున వచ్చు చున్న యన్నదమ్ములను జూచి ఋశ్యమూకముపైనున్న సుగ్రీవుడు భయపడి పాఱిపోయినాడట.

ఇప్పుడు పమేతము విశాఖపట్టణము, గంజాం జిల్లాల కొండలప్రాంతమందున్నవారు నాగరిక జను లను జూచినతోడనే పారిపోయి దాగుకొనెదరు."

ఇట్టి ధైర్యస్థైర్యములను గనుఁగొని యీవానరులే మానవులకుఁ దీసిపోవుదురని మనరామదాసుగారు నొక్కి వక్కాణించియున్నారు. హనుమదాదులు వివేకులుగాఁ దెలుపఁబడినను వానరులలో వివేకులుగాఁ దెలుపఁబడిరి. నరులతో సహవాసముచేఁ దమజాతి వానరులందు సహజ ముగా నుండు జ్ఞానముకంటె నెక్కుడు జ్ఞానము గల వారై యుండిరి. ఈ యంశమును హనుమద్విషయమై మన రామదాసుగారే యంగీకరించి యీక్రింది రీతిని వ్రాయించిరి.

"రామలక్ష్మణుల యొద్దకు ధైర్యముగావచ్చి మా ట్లాడిన హనుమంతుఁడు పట్టణవాసులతోఁ గలసిమెలసి తిరిగి ప్రాపంచికజ్ఞానము నేర్చిన దేశీయునివంటివాఁడు."

సుగ్రీవాదు లట్టివారు కారట. రామలక్ష్మణు లను జూడఁగనే భయపడి పారిపోయిరి. వెఱ్ఱి యూహ లకు లోనైరి. సుగ్రీవుని వెఱ్ఱియూహలఁ గనుఁగొని హను మ 'నీవు మనయందుఁగల మృగత్వము ననుసరించి యిట్టి యూహలకు లోనైతి'వని తెల్పె. 'ఆహార నిద్రాభయ మైథునాని' యను సామాన్య ధర్మముంబట్టి మాత్రమే నరవానరభేద మేర్పడలేదు. దేహములనుబట్టి, జ్ఞానేంద్రియ శక్తులంబట్టి, చర్యాదిక విశేషములం బట్టి యుభయులకు భేద మేర్పడినది. ఈ భేదమును రామాయణము విస్పష్టముగాఁ దెలుపుచున్నది. కోట్ల కొలఁదిగల వానరులు ఇద్దరు నరయువకులచేనడుపఁబడిరి. కాన శ్రీమద్రామాయణముంబట్టియును, మనరామదాసు గారివ్రాఁతలనుబట్టియును గూడ నరులకంటె వానరులు తక్కువవారని తేలుచున్నది. కాన నేను మొదట వ్రాసిన రీతిగా రామాయణస్థవానరులు నేటి నరులలోనివారు కాని, నేటివానరులలోనివారుకాని కారనియు, వీరి కుభయులకు నడిమిజాతివారనియు, వారు నశించిపోయి రనియుఁ దలంచుటయే యుచితము. అసురులనుజాతి యొకటి కలదనియు వారు క్రమక్రమక్రమముగా నశించి పోవుచున్నారనియు శ్రీరామదాసుగారే తమవ్యాసమున వ్రాసియున్నారు కాన వానరజాతి నశించిపోయినదని తెలుపుటకు నా రభ్యంతరముచెప్ప నవసరము కాన్పిం చుట లేదు.

సంపూర్ణము




చల్లా పిచ్చయ్యశాస్త్రి గారు

కడఁకను రేపు మాపనక కాళ్లను వ్రేళ్లను బ్రోవు సేయున
ప్పుడు ప్రియురాలనంచు నటు పుత్త్రుఁడనంచు సఖుండనంచు నా
ప్తుఁడ ననుచుఁ బోరింబోరిగ మూఁగుదు రీఁగలఁబోలి; యెంతకుం
బడయరు తృప్తి; యెవ్వరికి వారు స్వలాభమె కోరుచుందు; రె
ప్పుడయిన నీకు సుంత తలపోటు ఘటిల్లినఁ దొంగిచూడ; రే
యెడకొ యెదేనిమిత్తమున నేఁగుదు. రీక్రమ మెంచి యింక నీ
యెడఁద నెఱుంగుమీ వగలకే సిరులంచుఁ దలంపు. మాపయిఁ
జెడుగుల శిక్షణంబునను శిష్టజనంబుల రక్షణంబునన్
గడు నెనరొప్ప నొక్కఁడుగ గారవముం బొనరించువానిఁ, బా
ల్కడలి ఫణీంద్రశయ్యఁ గమలాసతితో సుఖియించువాని, లో
నడరెడు శత్రులం దునిమి, యట్టిటు నూఁపెడు నీషణత్రయం
బుడుగఁగఁ జేసి, కృత్రిమము నూడిచి, దూషణభూషణంబు లొ
క్కడుగఁ దలంచి, భూరజముఁ గాంచనముం సరిసేసి, యూరకే
వెడలెడు చిత్తకోర్కెలను వీసరవుచ్చి, యహంబు మాని, యా
ర్తుఁడయి, నిగూఢభక్తిఁ గుదురుంగొని చిత్తము రత్నపీఠిగాఁ,
దొడిఁబడు హర్షతోయములతోడన యర్ఘ్యముఁ బాద్యమచ్చి, ప్రా
న్పడి యరమోడ్పు గన్నుఁగవ బద్ధకరుండయి, "దీనబాంధవా!
చెడితిఁ గృశించితిం దడవు సేయక ప్రోవవె భక్తవత్సలా!
బడలితి మ్రగ్గితిం సిలుగు పట్టకసాకవె" యంచు సోలి కూ
యిడఁ గులజాతిభేదములఁ నెంచకయే వెనువెంట వచ్చు పు
త్తడిపువుఁబోడినైనఁ గయితామర మోడిచి వీఁడె పాద దా
సుఁడనుచుఁ బర్వులెత్తు నహిసూదనునైనను జూడకే కడుం
వడిఁ బఱతెంచి యాపదలఁ బాపెడువాని, జలంబు సొచ్చి మ్రు
క్కడిఁ దెగటార్చి వేదములు కాన్పున కిచ్చినవాని, వార్థిఁ ద్ర
చ్చెడు నెడ నద్రిమోచి సుధఁ జేర్చి సురస్తుతిఁ గన్నవానిఁ, బె

ల్లడచి నిశాటులీల వసుధాంగనఁ గాచినవాని ధూర్తుఁడై
కొడుకును బట్టి కొట్టి చెఱఁగొన్న ఖలున్ బొరిగొన్నవాని, మూఁ
డడుగుల నేలఁ గోరి జగమంతయు నిండినవాని, రాచ వం
గడ్డళ్ళులు పెక్కుమార్లు కడఁకన్ దెగఁ గొట్టినవాని, లోకముల్
పిడుగయి యేచు రావణుని బీర మడంచినవాని, గప్పుటా
మడుఁగు ధరించి భక్తులను మన్చినవాని, వ్రజాంగనామనో
జ్ఞుఁడయి యనేకచిత్రములు చూపినవాని, నెఱింగి బౌద్ధులన్
గడపఁగ యజ్ఞనింద మొగిఁ గీర్తనఁ జేసినవాని, దౌష్ట్యమున్
నడపెడు కర్కశాశయుల నాడులఁ జీల్చినవాని నెన్ను ఛో
నడఁగు నఘంబు; చేకుఱుమహాంబులు ప్రత్యహమున్; బ్రశాంతి యే
ర్పడు మది నిల్చు సర్వ మొక రాణన తోఁచు; లభించు మోక్షమున్;
దడఁబడకేచు వింతలకు దారి నొసంగక మెప్ప గోర కే
గడెయును దెంపులేకయ యఖండముగా నెటనున్న, మేని కే
బడలిక గల్గినన్, రొదలు ప్రామిన నిల్కడ నిట్టిభక్తి యే
ర్పడి తరియించినట్టి బుధరత్నములన్ వచియింతు: నంబరీ
షుఁడు శుకశౌనకుల్ దనుజసూనుఁడు వ్యాసుఁడు నారదుండు భీ
ష్మఁడు కనకాంగదుండు గజముఖ్యుఁడు దాల్భ్యుఁడు దీర్ఘదేవు ల
య్యోడయని కుబ్జుఁడున్ గుహావయోమణులున్ భుజగంబు పుండరీ
కుఁడు శబరుండు సాలెపురుగున్ నరుఁడున్ హనుమద్విభీషణుల్
పడఁతులలో నహల్యయును బాండవపత్నియు నింక నెందఱో
వడసిరి ముక్తి; మొన్న మనవార లెఱింగినవారు రామదా
సుఁడు నటు త్యాగయాదులును జూచిరి, చూపిరి దేవదేవు; నా
నుడి మదినమ్మి భక్తిని మనోమయపేటికలోన సొమ్ముగా
నిడి జగదేకనాథునకుఁ నెప్పుడుఁ గానుక పెట్టుచుండు మే
గొడవల కేగినన్ ఫలము కొంచియమైనను లేదు కాలమా
నషిఁ బరు వెత్తుచున్న దిటువంటిశరీరము రాదు రాదికన్.

సంపూర్ణము




విస్సకోట వేంకటరత్న శర్మగారు

## రంగము 1

ద్రేపల్లెలో కుటీరము

[చంద్రిక—విలాసిని]

చం—(కృష్ణవిగ్రహమునకు జలకమాడించి) కృష్ణా! ఏడువకు! ఏడువకు! తుడిచెదను. (పైటచెఱగుతో నొత్తును.)

వి—చెలీ! నిజమైన కృష్ణుడు కాడుగదా, ఏడ్చుటకు?

చం—కృష్ణా! తిలకము దిద్దెదను. రమ్ము; (తిలకమును దిద్దిచూచి) వంకరగా నున్నది. చక్కగా పెట్టెదను; రమ్ము. ముందు తొందరగా బెట్టితిని; క్షమింపుము. తప్పు మన్నింపుము. (తుడిచి మరలపెట్టి) ఇప్పుడు బాగున్నది.

వి—ఏమి నీకాపిచ్చి; బొమ్మకు బొట్టుపెట్టితివి?

చం—బొమ్మకాదే! బొమ్మల నాడించుబొమ్మలాట కాడే! కృష్ణా! ఒక్క ముద్దుపెట్టునాయనా! (ముద్దు పెట్టుకొని) కృష్ణా! నేడు నీవు పుట్టినరోజు. నీకు క్రొత్తచొక్కా,లాగూ తొడిగెదను రమ్ము.(తొడిగి) నాయనా! వీధిలోనికి పోకుము; దుమ్ము పైబడును. కొంచెము పేపు పండుకొందువా, జోకొట్టెదను. (ఉయ్యెలలోనుంచి)

గేయము.—

జో జో! గోపాలా! జో జో! భూపాలా!
జో జో! నాచిట్టీ! జో జో! నాపట్టీ!
జగముల నిట్టట్టాడించెదవు
మగువల మరుల ముంచెదవు......జో జో!
వారువీరని భేదము నెంచవు
సారెసారెకును దయనుంచెదవు......జో జో!

జో జో! మత్స్యావతార! జో జో!
జో జో! కూర్మావతార! జో జో!
జో జో! వరాహావతార! జో జో!
జో జో! నరసింహావతార! జో జో!
జో జో! వామనావతార! జో జో!
జో జో! రామావతార! జో జో!
జో జో! కృష్ణావతార! జో జో!
జో జో! ఋషభావతార! జో జో!
జో జో! కపిలావతార! జో జో!

విలాసినీ! ఆప్రక్కనుండి ఊపుము.

(చెరియొకప్రక్క నుయ్యెల నూపుచుందురు)

వి—నిజమైన కృష్ణుని తెత్తునా?

చం—నిజమైన కృష్ణుడు బాలుడు కాడుగదా, మనము చెప్పినట్లు వినునా?

వి—మనము చెప్పినట్లు విను కృష్ణుడే కావలయునా?

చం—అవును.

గీ. బాలకృష్ణుడైన జోలబాడగవచ్చు
ముద్దుకృష్ణుడైన ముద్దియవచ్చు
చిన్నికృష్ణుడైన చిందులు ద్రొక్కును
నల్లకృష్ణుడైన నాట్యమాడు.

ఇంతకన్న మన కేమికావలెనే విలాసినీ!

వి—నీకు పిల్లలు లేరుగావున నిట్లాడించెదవు, కొడుకు పుట్టినచో—

చం—కృష్ణుని పేరే పెట్టుకొని, కృష్ణునికివలెనే పింఛము పెట్టి ముద్దుపెట్టుకొందును. (బొమ్మను ముద్దుపెట్టుకొనును.) కృష్ణా! కృష్ణా! యని ఎప్పుడు పిల్చుకొనుచు, దగ్గఱ పరుండబెట్టుకొనుచు, లాలించుచు,

పాలించుకొందును. కృష్ణుని విడనాడియుండలేనే. కృష్ణుని తలపకున్న నాకేమియు తోచదే విలాసినీ!

వి—కృష్ణుని వ్రేపల్లెకు తీసికొని వచ్చుటకు, విద్యుల్లత, మధుర పంపగా, మధురకు పోయినది.

చం—ఎప్పుడు?

వి—ఇంతకుముందే, నాతో చెప్పిపోయినది.

చం—అయ్యో, నాతో చెప్పినది కాదేమే!

వి—ఎందులకు?

చం—నాకును మధురలో పనియున్నది.

వి—ఎవరినిమిత్తము ?

చం—కృష్ణునినిమిత్తము!

వి—ఆకృష్ణుడు పెద్దకృష్ణుడు.

చం—మాబాలకృష్ణునినిమిత్తము!

వి—ఎందుకు?

చం—మాబాలకృష్ణుఁ డాడుకొనుటకు బొమ్మలుకావలయును. బొమ్మ చేటలు కావలయును. తినుటకు పంచదారచిలుకలు కావలయును. ఇవన్నియు తెచ్చుటకు నాల్గునాళ్లనుండియు ప్రయాణమైతిని. కృష్ణుడు పంపించెదనని చెప్పి ఇంతవఱకు పంపియుండలేదు.

వి—మనము పోయినచో బాలకృష్ణు నెవరి కప్పగింతము?

చం—కృష్ణుని నీవెత్తుకొనుము. నేనును నీవును నడచి పోయి విద్యుల్లతను కలసికొందము.

వి—పట్టణములో నెట్లు మసలవలయునో మనకు తెలియదుగదా!

చం—అక్కడ కృష్ణుడు మనచిన్నికృష్ణునకు సాయము రాడా!

వి—సాయమునకేమి? అన్నియు తానే కొనియిచ్చును. మనకేమియు నాయాసముండదు. (బొమ్మనెత్తికొని) రమ్మక్క.

చం—పద—అగు—అగు—త్రోవలో బాలు డేడ్చునేమో ? పాలుతీసికొనివచ్చెదను. (పాలు తెచ్చి) ఇకపద.

[నిష్క్రమింతురు.]

రంగము 2

బృందావనము

ఉద్ధవుడు (ప్రవేశించి)

ఇప్పటికి బృందావనమును చేరితిని. ఈయమునా నదీపుష్పంబుల గంధంబు గ్రహించి, చల్లనితోయంబుల సూగులాడుచు, గంధవహుండు కునికిపాట్లు పడుచున్నాడు. ఒక్కింత బడలిక తీర్చుకొందును. కృష్ణుడు లేకున్న బృందావన మెంతరసహీనమై, వికాసరహితమైయున్నది. అదుగో, వారే గోపికా కాంతలు! అదియే వ్రేపల్లె!

గీ. గొల్లపిల్లలతోడను, బల్లతోడ
ఆలమందలతోడను పాలతోడ
కవ్వములతోడ కూనురాగములతోడ
నలరునయ్యదే, వ్రేపల్లెయని తలంతు!

(చూచి) ఎవరో ముువ్వురు కాంతలు వచ్చుచున్నారు. నేనేకృష్ణుడనని చెప్పినచో వీరిభావము లెట్లుండునో?

(విద్యుల్లత ప్రవేశించి, చూచి) కృష్ణుడే, కృష్ణుడే, నిజముగా కృష్ణుడే! పెదకదలవినతీగ కాళ్ల కడ్డువడినది. [మరలిపోవును.]

(చంద్రిక – విలాసిని ప్రవేశింతురు)

చ—కృష్ణుడే! కృష్ణుడే!

వి—కాదమ్మ! కృష్ణుడైనచో నెమలిపింఛ మేదీ! వేణు వేదీ?

చం—ఎక్కడనైన నను దాచివచ్చెనేమో!

వి—కాదు. ఎవ్వరో, నే నడిగి చూచెదను. (సమీపించి) అయ్యా! మీరెవ్వరు?

ఉ—నేను కృష్ణుడను కాదు; కృష్ణుని చెలికాడను.

చం—కృష్ణా,మాఅబ్బాయికి బొమ్మ లంపించెదనని చెప్పి ఎన్నినాళ్లయినది, మరచితివా?

వి—కృష్ణుడు కాదమ్మ! కృష్ణుని నేస్తకాడంగనా? కాదన్నాడు వినలేదా?

చం—కాదు; కృష్ణుని చెలికాడ నన్నాడు.

ఉ—(స్వ) ఈ మెయే చంద్రికయై యుండనోపు.

వి—మీరెవ్వరయ్యా, యేయూరు?

ఉ—మధుర!

చం—అదిగో! మధుర యనుచున్నాడే!

వి—ఎక్కడకు పోవుచుంటిరి?

ఉ—వ్రేపల్లెకు?

వి—ఏనిమిత్తమున?

ఉ—నందనందనుని నిమిత్తమున.

వి—ఇక్కడ లేడు.

ఉ—ఇక్కడ లేడని—ఉన్నాడని నేనూ ఎఱుంగుదును.

చం—ఏడే! ఉండుట యెట్లే.

ఉ—అదిగో! నీయొడిలో గలడు.

వి—నీయొడిలోని వేమిటి?

ఉ—బొమ్మలు.

వి—ఎవరికి?

ఉ—బాలకృష్ణునికి.

చం—మనకృష్ణునికేనటే!

వి—మరేమిటి?

ఉ—ఊఁ—.

వి—ఊఁ—యేమిటి?

ఉ—ఉద్ధవుఁడు.

వి—ఈబొమ్మ లెవ రంపించిరి?

ఉ—మాకృష్ణుడు.

చం—మాకృష్ణునికేనా?

ఉ—అవును.

చం—(బొమ్మ నెత్తికొని) మాకృష్ణునికేనా? మాకృష్ణునికేనా?మాకృష్ణునిమీద ఆకృష్ణుని కెంతప్రేమయో; ఎంతవాత్సల్యమో? నాయనా! ఇవిగో బొమ్మలాడుకొమ్మ. బొమ్మలేవి?

ఉ—ఇవిగో బొమ్మలు. (ఇచ్చును)

చం—(పుచ్చుకొని)అయ్యా! మీ రలసివచ్చితిరి. ఇవిగో మాపిల్లవానికై తెచ్చినపాలు పుచ్చుకొనుడు.

ఉ—మీకృష్ణు డేడ్చినను?

చం—బొమ్మలుంటే యేడువడు. (పాలనిచ్చును.)

వి—వ్రేపల్లెలో ఎవరియింటికి వచ్చెదరు?

ఉ—నందుని యింటికి.

చం—రండు. పోవుదము. ముందుగా మాయింటికివచ్చి మాచిన్నికృష్ణుడిచ్చు పండ్లు పుచ్చుకొని తరువాత మీ యిచ్చవచ్చినచోటికి పోవచ్చును. మధురలో కృష్ణునకు కుశలమా?

ఉ—ఇప్పటికా కుశలవార్త నడుగుట!ఆయనకుశలిగాక మరెవ్వరు కుశలులై యుందురు? మీచిన్నికృష్ణునిపై నున్నప్రేమ మాకృష్ణునిపై నుండవలదా? మా కృష్ణుడొకడు, మీకృష్ణు డొకడా? లోకములో సమస్త పదార్థములు మాకృష్ణమయములు గావా? చేతనాచేతనప్రకృతులు ఆమహానుభావునివలన సృష్టింపబడినవికావా? చిన్నికృష్ణునిమీద నీకుగల భక్తి ఆయనయేకదా కలుగజేయుచున్నాడు! నీలో, నాలో, అందరిలో ఆయన తేజస్సేకదా తాండవించుచున్నది! ఘటపటాదులు నశించినను బంధముల ద్రెంచువా డాయనగదా. ఆయనను కుమారునిగా భావించుచు తరించితివి!! నీకు సమాను లెవరున్నారు! కాని, నీబాలకృష్ణుడే అన్నిస్థలములయందును భూతభవిష్యద్వర్తమానములలో నున్నాడని తెలుసుకొనవలెను. అప్పు డీవిగ్రహమునందు మాత్రమే లగ్నమైన నీ మనసు సర్వవ్యాపకత్వముకలిగి,నీనిని వదలివేయును. భక్తులలో నగ్రగణ్యవగుదువు.

చం—మాయింటికి రండు, జ్ఞానోపదేశము చేయుదురు కాని.

ఉ—నాకు నందునియింటికి దారిచూపుడు. వచ్చినపని తీరినవెనుక మీయింటికివచ్చి మాపరమాత్మ చెప్పుమనిన వాక్యములు మీకు సెలెంగించెదను. రండు పోవుదము. [నిష్క్రమింతురు]

## రంగము ౩

### నందుని యిల్లు

[నందయశోద లుపవిష్టులై యుందురు]

య—నాధా! కృష్ణు డప్పుడే వచ్చునని యంటిరిగదా! ఇంకను రాలేదేమి? కన్నవారికన్న, కన్నవారిమీద నెక్కువ ప్రీతియుండునా?

నం—ఆతని కందరియందును ఒక్కచందంబై ప్రేమ వెల్లివిరియునుగాని—ప్రస్తుతము రాజకార్యములయందు నిమగ్నుడై యుండుటచే రాలేదు. నన్ను మరచి నను—

గీ. కడుపులో పెట్టుకొని ప్రేమ గాంచినావు
కనులలో పెట్టుకొని ముద్దు గాంచినావు
పాలపాత్రిల్లలో జోలబాడినావు
నిన్ను కృష్ణయ్య మరచునా నీలవేణి!

య—చిన్నతనంబున తానొనరించిన కొంటెపనులం దలంచిన కొలదిని నాకొడలు గగుర్పొడుచును. చన్నులం జేపువచ్చు; పరవశనై పోదును.

నం—సరికాని—మనవాడు పంపిన చిత్రములు దెమ్ము—మధురలో నొకచిత్రలేఖకునిచే లిఖించబడినవి. అవి చూచియైనను మురియుచు కాలక్షేపము చేసి కొందము.

య—అవి చిత్రములా! ప్రాణము మాత్రమే లేదుగాని—

నం—తెమ్ము.

(యశోదనిష్క్రమించి పటములతో వచ్చును.)

నం—(ఒకచిత్రమునుదీసి) ఆహా! కృష్ణుని చూచుచున్నట్లే యున్నది.యశోదా!చూచితివా!ఇందు మన కృష్ణుడు అరణ్యములో అగ్నిహోత్రము మ్రింగుచున్నట్లుగా లిఖింపబడినది.

య—నాయనా, పోకుము—కాలిపోవుదువు—మాకెవరు దిక్కు—నీవు పోవలదు నాయనా!

నం—ఇది నీవు తెచ్చిన చిత్రపటముగదా!

య—అవును—అవును—ఐనను,

నం—గీ. గోపకులెల్ల కన్మూసికొను డటన్న
కన్నులన్ మూసికొని వారు కదలకుండి
రంతటన్ విశ్వరూపుడై అంతలోన
లోనగొనియెను భయద దావానలమ్ము.

య—మనకృష్ణుడు మన్నుదిన్న నాటిచిత్రముందీయుడు.

నం—(తీసి) ఏమియు నెఱుంగనివానివలె నోరుతెరచి నీకు చూపించుచున్నాడు. నీవు కొట్టుటకు సిద్ధముగా నుంటివి—ఇప్పు డెవరిని కొట్టెదవు—నాయన దగ్గర లేడుగదా?

య—అవును. అవును. దురాత్మురాలనే!

నం—ఇది చూచితివా! కృష్ణుడు యమునాతీరమున నిసుకతిన్నెపై గోపాలబాలురతో చల్ది యారగించుట. కొందఱు చిక్కంబులలోను, కొందరు సున్నసైన శిలాతలంబులను,కొంద ఱాకులలోను ఎట్లు తినుచున్నారో?

మ. జలజాంతస్థితకర్ణికన్ దిరిగి రా
సంఘంబులై యున్న శ్రే
కులచందంబునఁ గృష్ణునిం దిరిగిరాఁ
గూర్చుండి వీక్షించుచున్
శిలలున్, బల్లవముల్, తృణంబులు, లతల్,
చిక్కంబులున్, పువ్వు, లా
కులు, కంచంబులుగా భుజించుటలు క
న్గొంటే! కురంగేక్షణా!

—భాగవతము.

య—(పటమిచ్చి) ఇదియేమి? నాథా!

నం—(చూచి) ఇది కాళియమర్దనము.

శంకరాభరణము - ఆదితాళము

య.—చూడజాల, నే చూడజాలనిది, నాథా!
పాడుచు నాడుచు తిరిగెడు నీడున,
పాడుకాళియుడు దాపురించెన్—చూడజాల.
పట్టి దేహమును బట్టె, గిట్టెన్, గొట్టెన్
చీలెన్,గీలెన్—చూడజాల.

నాకు భయమగు చున్నది పసిపిల్లవాడు—పాపఁడేడు. లత—వజ్రము అమ్మయ్యో! నేచూడజాలను. ఆనాటివేదన జ్ఞాపకమునకు వచ్చుచున్నది. మొదటినుండియు నిట్టి దుడుకుచేష్ట లే.

నం—అదివలదులే—ఇదిచూడుము, గోవర్ధనగిరి. కృష్ణుడు పర్వతమును పైకెత్తి.

శా. బాలుండీతఁడు, కొండదొడ్డది, వహా
భారంబు సైరింపఁగా
జాలండోయని దీనిక్రిందనిలువన్
శంకింపఁగాఁబోకుఁడీ

శైలాంభోనిధిఁ జంతుసంయుత ధరా
　　చక్రంబు పైఁబడ్డ నా
కేలల్లాడుదు, బంధులార! నిలుఁడీ
　　క్రిందన్ బ్రమోదాత్ములై.

అని ఓగ్గరగా చెప్పుచున్నాడు. అదిగో మనము దానిక్రిందనే యున్నాము.　　(చూచుచుండును).

య—కుబ్జవానికి గండములమీద గండములు.

(ఉద్ధవుడు ప్రవేశించును)

ఉ—అవును—గండములమీద గండములు. ఈమధ్య యమలోకమునకుపోయివచ్చెను—అతడు కుబ్జవాడా!

య—(చూచి) ఉద్ధవుడు—ఉద్ధవుడు—

నం—(పట మక్కడ నుంచి) ఎన్నాళ్లకు—ఎన్నాళ్లకు—కృష్ణుడు—కృష్ణుడు—(కౌగిలించుకొనును).

య—ఉద్ధవుడండీ!

నం—కృష్ణునిచూచినట్లే యున్నది. అందుకట్లంటిని. ఉద్ధవా, రమ్ము; కూర్చుండుము. ఆయాసపడి వచ్చితివి. కాళ్లుపట్టెదను. (కాళ్లుపట్టుచుయశోదనుచూచి) ఉష్ణోదకము తెమ్ము; కాళ్లు కడుగవలయును.

ఉ—అక్కర లేదు. ఆయాసము తీరినది

నం—కొంచెము విశ్రమింతువా? విసరెదను. (విసరును.)

ఉ—(స్వ) ఏమి! యీభక్తివిశేషములు! ఆకృష్ణపాదారవిందధ్యానానంద నిమగ్నులైన యోగుల క్రియ నాచరించుచున్నాడు. ఇంతవఱకు తన తనయుని యోగక్షేమమే అడుగ లేదు. అతిథిపూజయన నిట్లు గదా యుండవలయును!

నం—ప్రాణము కుదుటబడినదిగదా! ఎక్కడ మధుర: ఎక్కడ వ్రేపల్లె; వసుదేవునికి క్షేమమా!

య—కంసుడు తీరెగదా! ఇక నందఱకు క్షేమమేకలుగును.

ఉ—ఆ. సుఖముగా నున్నాడు.

య—దేవకి?

ఉ—ఆయమ కేమిలోటు? అనామయమే!

య—మాఅబ్బాయి మమ్మెప్పుడైన తలంచునా? బాగుగా చదువుకొను చున్నాడా?

నం—మేము జ్ఞాపకముందుమా, ఆ ముకుందునకు?

శా. అన్నా, భద్రమె? తల్లిదండ్రుల మముం
　　హర్షించి చింతించునే?
తన్నుం గాసిన గోపగోపికల మి
　　త్ర వ్రాతముం గోగణం
బు న్నిత్యంబు తలంచునే? వననదీ
　　భూముల్ ప్రసంగించునే?
వెన్నుం డెన్నడు వచ్చునయ్యా, యిట మా
　　వ్రేపల్లెకు న్నుద్ధవా!

కళంకములేని పూర్ణచంద్రబింబమునుబోలు ఆముద్దుమొగము చూడగల భాగ్యము మాకున్నదా?

య—నాకుమారుని జిలిబిలిముద్దుపలుకులను వినగల్గు భాగ్యము నాకున్నదా? నాతో నేమని చెప్పుమనియెను? తాను పంపించిన చిత్రముల జూచియు, చిన్ననాడుతానాడుకొన్నప్రదేశములనుచూచియు, వస్తువులను చూచియు, ప్రొద్దు పుచ్చుచున్నాము. కట్టెలిక్కడ: ప్రాణము లక్కడ.

ఉ—నాతో నెప్పుడును మీవిషయమే చెప్పుచుండును; మిమ్మే తలంచుకొనుచుండును; తోడివారితో వ్రేపల్లె నొనర్చిన చేష్టలను, మీరొనర్చిన మన్ననలను చెప్పుచుండును; మిమ్మును చూచుటకై శీఘ్రంబున వచ్చెదనని చెప్పుమనియెను. మీరు వగవవలదు.

నం—సాయంకాలములందు ప్రొద్దుగడపుట కేమిచేయుచుండును?

య—మునుపటికన్న చిక్కిపోలేదుగదా; బెంగ లేదు గదా! ఇక్కడున్నప్పుడు నా వీపు వదలువాడు కాడు.

ఉ—అమ్మా! గోపాలునిచేష్టల నేమని నుడువుదును? ఎంతని చెప్పుదును? సాయంకాలములందు స్నేహితులతో చేరి భవిష్యత్సమాచారముల నెన్నియో చెప్పుచుండును.

య—నాయనకు సంబంధములు వచ్చుచున్నవా? పెండ్లిమాటలేవైన చెప్పునా?

ఉ—విదర్భ రాజకుమార్తెను తాను పెండ్లియాడునట, తన బావమరదని పరాభవించునట! ఏమేమో జరుగ

నున్న సమాచారములు చెప్పుమందును. మీ రువ్వి
ళ్లూరుచు వినుచుందుము—ఇంతయేల? వారు లీలా
మానవవిగ్రహులుగదా!

మ. బలుఁడౌ గృష్ణుఁడు మర్త్యులే! వసుమతీ
భారంబు వారింప వా
రలరూపంబునఁ బుట్టినాఁడు హరి; ని
ర్వాణప్రభుం డెవ్వఁడు
జ్జ్వలుఁడై ప్రాణవియోగకాలమునఁ ద
త్సర్వేశుఁ జింతింప వా
డలఘుశ్రేయముఁబొందు బ్రహ్మమయుఁడై
యర్కాభుఁడై నిత్యుఁడై.

—భాగవతము.

అట్టినారాయణుని, అఖిలాత్మకుని కారణ మానవా
కారుని పెంచి పెద్దవాని చేసితిరి. మీ అదృష్టమే
అదృష్టము! మీభాగ్యమే భాగ్యము! మీ జన్మమే
జన్మము! మీరే ధన్యాత్ములని చెప్పదగినవారు. ఆ
మహానుభావుడు, కామ్యములం జ్యోతిస్కై పడి, మణు
లకు సూత్రమ్మువిధమ్మున, విరాజిల్లుచుండు. ఆతనికి
జననీజనకులనియు, దారాపుత్రాదులనియు, ప్రియా
ప్రియు లనియును లేరు; జన్మకర్మములు లేవు; గుణ
రహితుడయ్యు, ఆర్తలోకబాంధవుడై, మాయా
కాయం బాశ్రయించె.

య—చిన్నతనమున నాకు మంగళప్రదమగు విశ్వరూప
మును చూపించెగదా! ఐనను నా కజ్ఞానము నిలు
చదు. కుమారు డన్నభ్రాంతియే కలుగుచుండును.
ఉద్ధవా! మొదట యమలోకమంటి వేమి?

ఉ—సాందీపునిదగ్గర శిష్యత్వము తీరిన వెనుక, గురుద
క్షిణగా గురుపుత్రుని దెచ్చియిచ్చెను. ఆగురుపుత్రు
డు యమలోకములో నున్నాడట. అందుల కక్క
డకు బోయితినని చెప్పుచూ వచ్చెను.

నం—అతని కసాధ్య మేమున్నది?

ఉ—మన మదృష్టవంతులము కనుక ఆయనను చూచు
చున్నాము; ఆయనతో మాట్లాడు చున్నాము.

నం—మహాత్మా! మిమ్ముంజూచిన మాకృష్ణుని చూచి
నట్లున్నది.

ఉ—ఆమహానుభావుని పాదారవిందరేణు స్పర్శనము
చే పవిత్రములైన ఆయాస్థలంబుల చూడవలయునని

కోర్కెగలదు; చూపించుడు. అనంతరమునయాత్రో
న్ముఖుండ నయ్యెద.

నం— అట్లే! ముందు భోజనమునకు దయచేయుడు.
(యశోదనుచూచి) సర్వము సిద్ధము గావింపుము.

[తెరపడును]

## రంగము 4

వ్రేపల్లె వీథి

(మధుర - విద్యుల్లత)

మ—ఏడే! కృష్ణుడేడే! తానే వచ్చెనని చెప్పితివి.

వి—రాత్రి నందునియింట నుండెను.

మ—నిజము చెప్పుము. పోలేక కల్పించితివా? నేనైనను
పోవుదునే!

వి—నిజముగానే చెప్పుచున్నాను. దూరమునకు కృష్ణుని
వలె నున్నాడు. కృష్ణుడనుకొని నేను వెనుకకు వచ్చి
నాను.

మ—కృష్ణుడు కాడా యేమి?

వి—కాడు కృష్ణుడు—చెలికాడు.

మ—అయితే కృష్ణుడేడా?

వి—ఏమో?

మ—పోనీ! చూపించుము—కృష్ణు నెఱుగవటే!

వి—ఎఱుగ కేమి? మీకు మీకు—నే నెఱుగను—అప్పుడు—

మ—ఏమిహాస్యమే—నేనేపోయెదను లెమ్ము మధురకు.
(పోఁబోవును.)

వి—వలదు—వలదు, వచ్చినది ఉద్ధవుడే!

మ—ఉద్ధవు డెవడే? యెవ్వడైన నాకేమి—మధురాధవు
డు కాడుగదా!

వి—మధురాధవుడు పంపగా మధురదగ్గరకువచ్చినాడు.

మ—అట్లయిన నాయింటికి రాలేదేమి?

వి—నీకన్న నెక్కువవారు లేనప్పుడుగదా. ముందు నీ
యింటికి వచ్చుట!

మ—నాకన్న ఎక్కువవా రెవ్వరే, ఆయనకు?

వి—తల్లిదండ్రులు.

మ—ఏమని రాయబారము?



కోటలోని ప్రాసాదము—తంజావూరు



కోటలోని నక్షత్రమహల్—తంజాపూరు

వి—వచ్చెదనని-కాదు-వచ్చుచున్నానని.

మ—ఎప్పుడు?

వి—తన కవసరమైనప్పుడు.

మ—ఆరాయబారిని నాకు చూపింపవే!

వి—ఏమిచేసెదవు?

మ—ఇటువంటి రాయబారములు తేవలదనిచెప్పెదను.

వి—రమ్ము చూపించెదను. [నిష్క్రమింతురు]

(రాధ, పుష్పవేణి, నీలవేణి ప్రవేశింతురు.)

రా—నీలవేణీ! ఉద్ధవుడేడే!

పు—నీలవేణీ! రాయబారి ఎక్కడనే!

నీ—ఇప్పుడే చూచివచ్చితిని. యమునాతీరమున నొంటరిగా గూర్చుండెను. రండు. త్వరగా నడచిరండు. [నిష్క్రమింతురు.]

## రంగము 5

యమునాతీరము

[ఉద్ధవుడు]

ఆహా! ఆమహానుభావుని పావనస్నానముచే పవిత్రమైన యమునానదీతోయంబుల గ్రోలు భాగ్యంబు కలిగినది. ఆ లోకేశ్వరుని పదాబ్జపరాగంబుచే ననఘంబైన బృందావనమందు సంచరింపగల్గితిని. ఈ వ్రేపల్లెవారి యదృష్ట మేమియోకాని, ఒక్కొక్క కాంత కృష్ణుని భర్తగా దలపోసి భక్తి సేయుచుండు. ఒక్కొక్క పడంతి కృష్ణునిం బుత్రునిగా భావించి ప్రేమ లొల్కుచుచుండు. ఒక్కొక్కడు కృష్ణుని దండ్రిగా భావించి తరింపనూహించు. ఒక్కొక్కడుకృష్ణుని చెలికాడుగా భావించి సంసారబంధము పటాపంచలు గావింపనూహించు. ఇంకను దమకుమారులకు కృష్ణనామధేయము లిడి "కృష్ణా! కృష్ణా" యని కొంగులు జపించుచున్నారు. ఏదోవిధముగ ప్రతివారి నోటివెంట 'కృష్ణ' యనుశబ్దమే వినవచ్చుచున్నది. ఏమి, వీరి పూర్వజన్మపుణ్యము! ఇట్టి పరమభక్తులను, భక్తురాండ్రను చూడగల భాగ్యము నాకు లభించినది. వీరిలో ఎవ్వరి పాదరేణువున కైనను నేను చాలుదునా?

### మోహనరాగము - ఆదితాళము

ఎంతపుణ్యవతివో! బృందావనమా! నీ వెంతపుణ్యవతివో!
నందనందనుడుతానానందంబున-నీయందుఁ గ్రీడించెఁ
—ఎంతపుణ్యవతివో!

ఓయమునానదీతీరపాదపలతాళులారా,
మా దేవదేవుని దేహముమీదను
పూలవానలు వర్షించితిరా?
మీరే ధన్యాత్ములు, మీరే పుణ్యాత్ములు
మిమ్మే గణింపవలయుఁ—ఎంతపుణ్యవతివో!

సరిపోలుదునా, ఓసైకతమ్ములారా? మీతో నేసరిపోలు
మా సరసిజాక్షుని పాదస్పర్శఁ (దునా?
మహిమలు మీయందుండుఁ—ఎంతపుణ్యమతివో!

(విద్యుల్లత - మధుర ప్రవేశింతురు)

మ—(చూచి) విద్యుల్లతా! ఉద్ధవుడంటివే, మాధవుడే! కృష్ణుడే.

వి—చూచినవారెల్లరు నీధవు లేనా? నేనును భ్రమపడితిని. ఆ నెమలిపింఛమేదీ?

మ—అవునే! కృష్ణుడుకాడే! కొన్ని పోలికలు మాత్రమున్నవి.

వి—దగ్గరకు రమ్ము-సంభాషింతము.

మ—ముందు నేను సంభాషింపను.

వి—ఆయనయే ముందు మాటాడడు.

ఉ—నా రాయబార మిక్కడనే తీరునట్లున్నది. ఒక్కొక్కరే వచ్చుచున్నారు.

మ—పోనీ! నేనే పల్కరించెదను. (తలవంచుకొని) మధురనుండిగదా రాక!

ఉ—అవును, మధురనుండి. మధురానాథు డంపగా మధురాదులకు రాయబారమును దెచ్చితిని.

మ—ఓహో! (కొంచెమలుకతో) నీ వింత చెప్పిచెప్ప నక్కఱలేదు.

చ. ఎఱుఁగుదుమేము నిన్ను వన
జేక్షణ మిత్రుఁడవీవు; కూరిమిఁ
మెఱయుచుఁ దల్లిదండ్రులకు
మేలెఱిఁగింపఁ బ్రియుండు పంపఁగా

పాఱలేదు భక్తి వచ్చితివి
  వారలనైన మనంబులోపలన్
మఱవఁడు శౌరి మేలు! మరి
  మాన్యులు రాజునకెవ్వ రిచ్చటన్.
—భాగవతము

మకరందమానందముగ్గనం గ్రోలి పుష్పంధయము లా పుష్పముచెంత నుండవుగదా? అట్లే మగవారు తమ యక్కఱదీరినంతనే తొంగియైనను చూడరు.

(రాధ, పుష్పవేణి, నీలవేణి ప్రవేశింతురు)

నీ—అదుగో! ఆసూర్యస్నాతడే! (చూచి)ఇదిగో ఇక్కడకు మధురయూ వచ్చినది.

పు—మనకన్న ముం దరుదెంచి ఏమేమో గొడవలు చేయుచున్నది.

రా—మనమందరము నామహానుభావుని దాసీజనంబులమే కదా!

నీ—పుష్పవేణీ, మాట్లాడింపుము.

పు—నేను ముందుగా ప్రశ్నింపను.

నీ—పోనీ! ఆయనను సౌమ్యని చెప్పుము.

రా—అపరాధము అపరాధము. నేనే పలుకరించెదను. (సమీపించి) అయ్యా! మా గోపాలునికి పోషణ చక్కగా జరుగుచున్నదా! సుఖియైయున్నాడా?

ఉ—ఆయన సుఖియై యున్నాడు.

పు—నాకు సిగ్గగుచున్నది! అన్యాపదేశముగా పలుకరించెదను. (తుమ్మెదను చూచి)

మ. భ్రమరా! దుర్జనమిత్ర! ముట్టకుము మా
  పాదాబ్జముల్ నాగర
ప్రమదాళీ కుచకుంకుమాంకిత లస
  త్ప్రాణేశదారు ప్రసూ
న మరందారుణితాననుండ వగుటన్
  నాథుండు మన్నించుఁ గా
క! యమున్నే భ్రమఁ జారకాంతల శుభా
  గారంబుల్లన్నిత్యముల్.
—భాగవతము.

ఉ—నేను అన్యాపదేశంబుగా మాట్లాడెద. ఈనిష్ఠుర వాక్యంబుల నీతడు కృష్ణునకెఱిఁగించుగాక! (తుమ్మెదను చూచి)

మ. ఒక పువ్వందలితేనెఁ ద్రావి మధుపా,
  యుత్సాహివై నీవు వే
ఱొకటిన్ బొందెదుభంగి మమ్మధరపీ
  యూషంబునన్ దేల్చి మా
యకలంకోజ్జ్వల యౌవనంబు గొని య
  న్యాసక్తుఁ డయ్యెన్ విభుం
డకటా! అతనికెట్లు దక్కె సిరి! మి
  థ్యాకీర్తి నమ్మెంజుమీ!
—భాగవతము.

రా—మన మిట్లు నిష్ఠురోక్తు లాడుట మంచిపనికాదు. ఆమహానుభావుని కందరు సమానులే! చూచిన వారెల్ల రాయనను కోరుచుందురు. ఆయనయం దేమి తప్పు గలదు. ఆజగన్మోహనమూర్తి కొన్నాళ్లు మన యండ నుండెగదా! అంతియేచాలును. మన నోము ఫలముచే ఆయన మరల రాకపోడు. అయ్యా, ఉద్ధవా! మాధవుడు నన్నెన్నడైన తలంచునా?

శా. ఏకాంతంబున నీదుపై నొఱిగి తా
  నేమేని భాషించుచో
మాకాంతుండు వచించునే, రవిసుతా
  మధ్య ప్రదేశంబునన్
రాకాచంద్రమయూఖముల్ మెఱయఁగా
  రాసంబు మాతోడ నం
గీకారం బొనరించి బంధనియతిన్
  క్రీడించు విన్నాణముల్.
—భాగవతము.

ఉ—చెప్పకేమి? మీ అన్యాజానురాగంబును, మీతో జలకేళిగావించుటయు, రాసక్రీడ గావించుటయు, చెప్పిచెప్పి మీయందే మనస్సంతయు నుండెనను చుండును.

పు—

ఉ. బంధుల బిడ్డలన్ మగల
  భ్రాతలఁ దల్లులఁ దండ్రులన్ మనో

జాంధతఁజేసి డించి శర
ణందిన మమ్ము వియోగదుర్దశా
సింధువులోనఁ ద్రోఁచి యిటు
చేరకపోవుట పాడిగాదు పు
ష్పంధయ! మీయధీశునకుఁ
బాదములంబడి యుత్తిచెప్పవే!

—భాగవతము.

మ—పుష్పవేణీ! ఏమినీవెఱ్ఱి! పట్టణములో సౌఖ్యము లెక్కడ చిక్కునా? అయ్యో, ఉద్ధవా!

సీ. కాంచనరత్న సంఘటిత సౌధంబులే,
మా కుటీరంబులు మాధవునకు?
వివిధనరేంద్రసేవిత రాజధానియే
మాపల్లె యదువంశమండనునకు?

—భాగవతము.

పు—బాగుగా చెప్పితివే? నేనును ముఖాముఖి చెప్పెదను. ఇంకను అన్యాపదేశ మేల?

సురభిపాదపలతాశోభితారామమే
మా యరణ్యము సింహమధ్యమునకు?
కమనీయ లక్షణ గజతురగంబులే
మా ధేనువులు కంసమర్దనునకు?

మ—
రూపవిభ్రమ సైపుణాఢ్యలైన
మగువలమె మేము మన్మథ మన్మథునకు?

పు—
ఏల చింతింప మముఁ గృష్ణుఁ డేలతలఁచుఁ
బృథివి నధిపులు నూతనప్రియులుగారె?

రా—అయ్యో, ప్రియుని నొప్పనాడు మండిరే! నా నాథున కేమికోపము వచ్చునో? ఉద్ధవా! నానాథుని బ్రతిమాలుకొంటినని చెప్పుము.

ఉ—ఓహో! కాంతామణులారా!

మ. జపదానవ్రతహోమసంయమ తప
స్స్వాధ్యాయ ముఖ్యంబులన్
నిపుణుల్ గోరియు నేవిధిన్ మనములన్
నిల్పంగలే రట్టి స
ద్విపులాకారుని పై మహామహిము పై
విశ్వేశు పై మీకజ
స్రపటుధ్యానము లిట్లు, నిల్చెను భవ
చ్చారిత్రముల్ చిత్రముల్.

—భాగవతము.

శ్రీకృష్ణపరమాత్మ నన్ను మీయొద్దకు పంపువేళ పలికిన పలుకులు గల వాకర్ణింపుడు:

రా—నాతో నేమని చెప్పుమనియె?

పు—న న్నేమనియెను?

మ—నామాట నాథునికి జ్ఞాపక మున్నదా?

వి—ముందు మధురమాట చెప్పుడు.

ఉ—మధురమాటయే చెప్పెదను.

వ—ముందు పుష్పవేణిమాట చెప్పుడు.

ఉ—అట్లే!

రా—అయ్యో! ముందు వారికిం దెలుపుడు, నాతో నాపల నెమ్మదిగా నెరుంగజేయుదురు గాని.

ఉ—మీకందఱకు నిట్లని చెప్పుమనియె:

మ. చెలువల్ దవ్వుల నున్న వల్లభులపైఁ
జిత్తంబులంగూర్తు రు
త్కలికం జేరువవారికంటె; నదియున్
గాకెప్పుడున్ నన్ను మీ
రలు చింతింపను నుండఁగోరి యిటు మా
రస్థత్వముం బొందితిన్
దలకం బోలదు నన్నుఁగూడెదరు ని
త్యధ్యానపారీణలై.

—భాగవతము.

మ—మహాత్మా; ఆయన వచ్చెదనన్నను, మథురాపురీ యువతు లాయనకడ్డమై రానిత్తురా!

సీ. విభుఁడు మా వ్రేపల్లె వీథుల నేతేరఁ
జూతుమే యొకనాడు చూడ్కు లలర!
ప్రభుఁడు మాతో నర్మభాషలు భాషింప
విందుమే యొకనాఁడు వీను లలర!

పు—
తనువులు పులకింప దయితుండు డాసినఁ
గలుగునే యొకనాఁడు కౌఁగిలింప!
ప్రాణేశ, మమ్మేల పాసితివని దూఱ
దొరకునే యొకనాఁడు తొట్రుపడఁగ

రా—
వచ్చునే హరి మేమున్న వనముఁజూడ
తలఁచునే భర్త మాయింటితగులు లెఱుఁగు

పు—

తెచ్చునే విధి మన్నాథుఁ దిట్టువడక
ఎఱుఁగఁ బలుకు మహాత్మ, మీ కెఱుఁగవచ్చు.

—భాగవతము.

ఉ—కాంతామణులారా, మిమ్ముఁగాంచుటచే ధన్యుం డనైతిని. మీభక్తిశ్రద్ధలు పురుషులలోనైననుగాంచను. మధురలో కాదు. కృష్ణుండు మీ యందే యున్నాడు. మీరే కృష్ణులు. కృష్ణులే మీరు. ఏమియు భేదము లేదు. నేనును బోవలయును. సందేశ మెఱింగింతురా? (స్వ) ఏమని సందేశ మిత్తురు?

శా. ఈవీటన్‌గల గోపకాంతలకు 'శ్రీ
కృష్ణా! మనోనాథ' యం
చేవేళన్ స్మరియించుటే పని; జగం
బే లేదు; సంసార పా
రావారంబున మున్గియున్నను నజ
స్రధ్యాన పారీణలై
రీవ్రేపల్లెను కృష్ణుడుండె నట లే
నే లేఁడు యోచించినన్.

పు—అయ్యా! ఉద్ధవా! నామాటలుగా నిట్లనుము. అక్కడకు వచ్చిన యశోద తన్నుం గట్టిపెట్టునని భయమేమో? నేను విడిపింతువని చెప్పు.

మ—ఈపర్యాయము నేనే కట్టిపెట్టెదను. నా యిల్లు కదలనీయను.

వి—బిగ్గరగా ననకు. ఈయన వినిపోయి ఆయనతో చెప్పును; ఆయన విని ఇక్కడకు రాడు. ఆయన రాకున్న నో నన్ను పరుగెత్తించెదవు.

రా—(స్వ) నామనంబున నీవఱకే భక్తిలతాబద్ధుని చేసితిని.

ఉ—ఇప్పుడు సందేశమేమని?

మ—అయ్యా! ఇట్లనుము.

సీ. తనుఁబాసి యొక్కింత తడవైన నిటమీఁద
నేలపై మేనులు నిలువవనుము

వి—

నేలపై మేనులు నిలువక యటమున్న
ధైర్యంబు లొక్కట తలఁగునవనుము

పు—

ధైర్యంబు లొక్కట తలఁగినపిమ్మట
చిత్తంబు లిక్కడ చిక్కవనుము

నీ—

చిత్తంబులిక్కడ చిక్కక వచ్చిన
ప్రాణంబు లుండక పాయవనుము

రా—

ప్రాణములువోవ మఱి వచ్చి ప్రాణ విభుఁడు
ప్రాణిరక్షకుఁడగు తన్నుఁ బ్రాణులెల్ల
చేరి మాఱంగ మఱియేమి సేయువాఁడుఁ
వేగ విన్నప మొనరింపవే? మహాత్మ!

—భాగవతము.

ఉద్ధవా! నీవు మాపాలిటి కృష్ణుఁడవే! మాయింట విందారగింప ప్రార్థించుచున్నాను. అనంతరముపోవచ్చును.

ఉ—కాంతామణులారా! యశోదానందులకు నా ప్రయాణము నెఱింగించి వారు దేవకీవసుదేవుల కిచ్చు కట్నములుగైకొని వచ్చి మీ విందారగించి పోవుదును. మీరు పోయి మీమీగృహకృత్యంబులను దీర్చుకొనుడు.

[గోపికలు నిష్క్రమింతురు]

హా! కృష్ణా! ఆర్తలోకబాంధవా! ఈవ్రేపల్లెం జూచిన, యీగోపగోపికాజనంబుల పలుకుల నాలకించిన, వీరి భక్త్యనురక్తులం దిలకించిన నాకొక్క కోర్కె వొడముచున్నది. ఈజన్మమున నెఱవేరదు. కాని,

ఉ. దానవ హంతకా! మఱొక
ద్వాపరమందునైనఁ గాని బృం
దావననీరజాకరము
నన్నుఁ బవ్వముగా నొనర్చి నీ
వీనసబోడులన్ గలసి
యించుక కేళి యొనర్చి నీదుహ
స్తానన నన్నుఁ ద్రుంచి ప్రియ
తామర సాక్షి కొసంగవే దయన్.

గీ. అట్లు కాదేని వ్రేపల్లె యందు నన్ను
గోపికాకాంతగాఁ జేయఁ గోరుచుంటి
చెలువుమీఱ నిన్ గౌఁగిలించితినయేని
భవభయము లేదు వేణుగోపాల, కృష్ణ!

[నిష్క్రమించును.]

---




హరి లక్ష్మీనరసింహారావు గారు

జనకుఁడు దల్లియున్ సఖుఁడు సద్గురుఁడున్ దగు గ్రంథరాజముల్
తనకు హితంబుఁ జెప్పఁగఁగలా! రొక దాని నొకండు మించియుం
డునవియు; తండ్రిగారికిఁ గుటుంబభరంబు కరంబుఁ గల్గియుం
టను వ్యవహారధోరణినడంగి మనస్స్తిమితంబులే కొక
ప్డు నెఱి దొరంగి సమ్మతి విబోధ మొనర్పఁగ లేకపోవుఁ ద
ల్లి నిజతనూజులందునఁ గడింది మనఃప్రియ మూని తన్గనుం
గొన దొకవేళఁ గన్నకడగొట్టుసుతున్ గడుగారవంబుతోఁ
గనుఁ జనవిచ్చి; యయ్యది వికారము వానికిఁ దెచ్చు, ముద్దులా
డును మొఱకౌనతండు; సఖుఁడున్ బ్రవచించు హితాహితంబు;
లెందునయిన నమ్మగాఁదగుహితుం డిలలేఁడు గలిన్; గనన్ జెలం
గిన నిజకార్యతత్పరనికృష్టతమై సతఁ డుండు; నట్టివా
డనఁగ సుధానులిప్తనిశితాసిగదా ప్రజలెల్లఁ దా రెఱిం
గిన ఘనుఁడైనచో వినుట కృత్యమె? దేశికుఁ డమ్మ కన్న,సి
జనకునికన్న నెక్కుడగు జ్ఞానసులోచన మిచ్చు; దాన నూ
తనవివిధమార్గముల్ తెలిసి తత్త్వసమర్థతఁ గాంతు వీవు; వృ
ద్ధ నభిలషింతువే న్గురుని దేకువతో మది నమ్ముకొమ్ము; యా
యన వచియించుసుద్దులయథార్థముఁ బూర్తిగ నేర్చుకొమ్ము స
జ్జనతనుగాంతు, ముందు నిముసంబయినన్ వృథపుచ్చు; కొక్క వే
ళను గురుఁడున్ బొరంబడఁగలాఁడు ప్రమాదము నైజమౌట; నం
తన నిరసించ కార్యజనతాకృతపుస్తకసత్యధర్మముల్
గని 'యిదమిత్థ'మం చెఱుఁగఁగాఁదగు; వేదములన్న రాజ శా
సనములు; మిత్రబోధనలు చాలుఁ బురాణము; లెల్ల కావ్యముల్
తనననబోఁడి యాడెడివిలాసపుఁ బల్కుల కీడగున్; సుధీ
జనులు తదీయతత్త్వ మనిశంబు గ్రహించి మదిన్ ముదంబుతోఁ
గనుఁగొని త్యాజ్యమున్ విడిచి కాంతురు బోధము మోహదూరులై.




భమిడిపాటి కామేశ్వరరావు గారు

[అసలు ఈ వ్యాసము 25-3-25 నాడు, రాజమండ్రీ ట్రెయినింగుకాలేజీలో వార్షికోత్సవానికి చదివే ఊహతో వ్రాసింది. కాని ఆయేడు కాలేజీలో తత్‍దినమే జరగలేదు; సరి, ఇది చదవడం పడలేదు. మళ్లీ సాంవత్సరికానికి—అనగా ఈయేడు మార్చిలో ఇది అక్కడే చదవడానికి ఏర్పాటూ జరిగింది; కార్యక్రమంలో ఒకవిషయం కిందా ఎక్కింది. ఎక్కితేం! ఇతరవిషయాల మూలాన్ని దీనికి టైములేకపోయి, దిగింది. మానలో మనమాట, ఆయితరవిషయాలు ఏమి టనుకున్నారు? కేవలం, ఫలహారాలు స్మండీ! ఆ తరవాత, ఏప్రిల్లో ఇది వీరేశలింగం స్కూల్లో పాతవిద్యార్థుల సమావేశానికి ఊరికే స్మాల్‍కాజుగా చదవడం అయింది. అయితేమి? ఇది నేను ఆ ట్రెయినింగుకాలేజీలోనే చదువుతున్నానని, చూడండి.]

అగ్రాసనాధిపతికీ, సభాసదులకూ, నమస్కారములు. ఇంతఉత్సాహముతో, ఇన్ని పట్టుదలలతో, ఇన్నివందలమంది జ్ఞానభాస్కరులు బాలుర అజ్ఞాన తిమిరాన్ని పటాపంచలు చెయ్యడానికి శుభమల్లే తయారవుతూన్న, అయిన ఈసందర్భంలో, అట్లా తయారు చెయ్యడానికి వీరకంకణం కట్టుగున్న ఆలయమంటపమైన ఈస్థలంలో నేను మేష్టరుపదవిని గురించి అవాకులూ, చవాకులూ, మాట్లాడాలనిరా లేదు. మేష్టరీ గురించి సమంజసంగా మాట్లాడడానికి ఏడాక్టరో, ఏలాయరో, అధమం ఏమేష్టరేతగుడో అయితే బాగుండేది; కాని ఈర్ష్యకొద్దీ మాట్లాడారని అనిపోతారనో, లేక దీనికాపాటి ఔన్నత్యము లేదనో, మరేమి కర్మమో కాని,దీన్ని ఊరికే లాంఛనానికి ఏదోగొప్పదే అంటూండడం తప్ప తభిసీలుగా దీని ప్రమేయం ఎవ్వరూ రానివ్వరు. పైగా సాధారణంగా ఎవరిగొడవ వారిది. అందువల్ల నేను మేష్టరైనా ఏది? నేను మేష్టరైనా మేష్టరీమీద కొన్ని అభిప్రాయాలు మీతో చెప్పడానికి తెగిస్తున్నాను, ఓపట్టాన్ని మేష్టర్లు దేనికీ తెగించకపోయినా. స్వవిషయం నిర్మొహమాటంగా చెప్పడం కష్టమని నాకు తెలుసు. అదీగాక, మనసంగతి మనకొక్కరికీ తప్ప కడమఅందరికీ తెలుస్తుంది అన్నాడు ఒకాయన. కాని మనసంగతి పూర్తిగా మరోడికీ తెలియదు సరిగదా, మనకు తెలిసినదొరి ఒకటే, తక్కిన ఎల్లరకూ తెలిసినది మరొకటీగాని, మనకు ఏమీ తెలియదు అనడంకూడా బేసబబే. ఏమైనా, నేనేదోపరాయివాణ్ణే అనుకొని జనబాహుళ్యంలో మేష్టరీ గురించి ఉండేఅభిప్రాయాలూ, మరికొన్ని ఇతరమైనవీ మీతో మనవిచెయ్యాలనినా తాత్పర్యం. అవి మనం తెగవింటూంటాం. అవినిజం. నిజంఅనేది ఎన్ని పెట్టెల్లో పెట్టి బిగించి తాళాలువేసినా నేనూ ఉన్నానని మళ్లీ సిద్ధమవుతూంటుంది. అందుకని, ఇవి నేను చెప్పకపోతే మరొకరైనా చెప్పితీరతారు. మరొక్కటు శేషం. ఇవి ఇప్పుడు మీరు వినేటప్పుడు, ఎక్కడైనా నూటికీ కోటికీ చిరునవ్వు రావచ్చు ఒకవేళ. ఎంచేతంటే, సరిగ్గా ఉన్నది ఉన్నట్టు నిజం విన్నప్పుడు మనకు నవ్వురావచ్చు "నిజమేస్మీ" అనిపించి. అలాంటప్పుడు, ఆనవ్వు న్యాయమైన దనిన్నీ, దానిలో అప్రతిష్ఠ ఎంతమాత్రం లేదనిన్నీ, అది మేష్టర్నిగాని, మరి ఏఇతరుణ్ణిగాని నిరసన చెయ్యడంవల్ల

పుట్టించినది కాదనిన్నీ జ్ఞాపకం పెట్టుగోమని సభవారిని కోరుతూ, ఇంతటితో ఉపోద్ఘాతం కట్టేస్తున్నాను.

ప్రతిదాన్ని గురించి ఎల్లాగో, అల్లాగే మేష్టరీ గురించికూడా అభిప్రాయభేదాలు బహుదట్టంగా ఉన్నాయి. ఇతర దేశాల్లో అన్ని విషయాలా అభిప్రాయాలూ, భేదాలూకూడా ఎక్కువేకాని, మనదేశంలో భేదాలుమాత్రమే విశేషం. పైగా, ఈయొక్క అభిప్రాయభేదానికి, అనగా త్యాజ్యానికి, ఉండే పరిమితి అపారం. మేష్టరీ చాలా ఉత్కృష్టమైనపని కొందరు జ్ఞానుల ఉద్దేశంట. అది చాలా చవటపనని చాలామంది ఇతరుల ఉద్దేశంట. ఇందుకనే హాస్యం బయలుదేరడం. ఇది ఎల్లా ఉండంటే; వెనకొంటికి ఓ మేష్టరుగారు, కుర్రాడు అల్లరిచేశాడూ అనుకున్నప్పుడు "Stand there you D. D." అనేవాడు. అప్పుడు కుర్రాడు తప్పుచెయ్యడం ఒప్పుకుంటూన్న మొహంపెట్టి నిలబడితే, "పూర్చో, నిన్ను మరేమీ అనలేదు. Doctor of Divinity అన్నాను" కాని, కుర్రాడు ఇంకా తెగ సాగుడుగా నిలబడితే, "D. D. అంటే ఎటుగుదువా? Doctor of Divinity అనుకుంటున్నావేమో పొరపాట్న. Double Duffer అన్నమాట" అనేవాడు. ఆయనే చెప్పాడు, తనకి చుట్టంటే మహా అయిష్టంట. తను ఒక స్నేహితుడితో మాట్లాడుతూ, "అబ్బ! ఏమి దుర్వ్యాసనండీ, ఎల్లా కాలుస్తారోగాని" అన్నాట్ట. అంటే, అవతలాయన గబగబా పైకి ఎగబీలుస్తూ "ఆహాహా! చుట్టతాలూకు పరిమళం ఏం పరిమళమండీ!" అనేవాట్ట. అలాంటప్పుడేకదూ వ్యాపారం ఏదైనా హాస్యాస్పదం కావటం! 'మేష్టరీ బహుపవిత్రమైన'దని కొందరు. 'బతకలేకపోతే బడిపంతులు అని జనవాక్యంపోవయ్యా!' అని కొందరు. ఆదీగాక, మామూలుగా ప్రయాణాల్లో, ఒకర్ని, పక్కవాడు, "అయ్యా, మీదేవూరు?"; "ఫలానా"; "మీకేమన్నా ఉద్యోగమా?";"ఆ";"ఏం ఉద్యోగమండీ?"; "మేష్టరు" అని వినీవినడంతోటే వాడు సప్పరించేసి పెదవి విరవడం, పక్కమొహం పెట్టడమూనూ. అనగా, వాడి ఉద్దేశం, "ఇవతల వాణ్ణి లాక్కెళ్లి పైవారు మిక్కిలీ ఘనమైన పదవుల్లో ఉంచి చూడగా, వీడు వాట్లల్లో శ్లోకికైనా పూర్లేదుగావును, అప్పుడామట్టున 'శిరోభవ వరదోభవ' అని చెప్పి ఈతణ్ణి ఈమేష్టరీలో పడేశారు!" అని, "ఏదో పట్టినూనెమిఠాయిసరుకులాంటి నాసిరకం అయిఉండకపోతే మేష్టరీలోకి ఎందుకు సిద్ధమైఉంటారు!" అని. దీనిపైన, 'బతకలేకపోతే భాగోతం' అని మరోనుక్క వింటూంటాం. బడిపంతులు చర్యంతా భాగోతం ఖత్తు అనేమో బోగనకీ బొమ్మలాటకీ ఇంతసంబంధం కలిపింది. ఈసాపత్యానికీ తార్కాణకూడా ఎప్పుడేనా దొరుకుతూంటుంది లెండి. ఆమధ్య ఓవూరు నలుగురు ఆసామీలు వచ్చారు స్వగ్రామంనించి. వచ్చి చూడవలసినవన్నీ చూసేసినవాళ్లవడంచేత, వాళ్లు నాటకంలో చేరడానికి సకలప్రయత్నాలూ చేశారు. కాని, వాళ్లగాసం, ఇక్ష్వాకుల పూర్వంది అవడంచేత కాబోలు వాళ్లని అందులోకూడా చేర్చుకోకపోగా, వాళ్లు మరీ చిట్టచివరకి అమాంతంగా, గోవిందా అనిచెప్పి, మేష్టరీ ట్రైనింగులో జేరి ఊరుకున్నారు. అల్లాంటివాళ్లవల్ల నేమో జనుల్లో అభిప్రాయం. ఒకానొకప్పుడు, ఒక రెవరైనా పెద్దచదువు చదువుకుని, తీరామోసి వట్టిమేష్టరీచేస్తూంటే, అదివిని, విచారంతో, పెద్దమనుష్యులూ, పరిచయులూ, బంధువులూ అతనితో మాట్లాడుతూ "ఇన్నాళ్లూ బతికి-అన్నట్టు ఇన్నాళ్లూ చదివి చివరకి మేష్టరీలో చేరావేమిట్రా, ఆడదీ కాకుండా మొగాడూ కాకుండానూ? ఒకటోరకమైన ఇతర ఉద్యోగాలు దచ్చివన్ని ఉంటూంటే, ఇదేమిట్రా బోడిఉద్యోగం? హాయిమంటూ ఉండును, రిజిస్ట్రీలో జేరకపోయావుట్రా, బాబూ! కించిత్తూ రొష్టులేకుండా పుచ్చుగోవచ్చుగా రెండుచేతులా! ఇచ్చేవాళ్లకి నష్టంలేదు, నీకులాభం. మధ్యవర్తులుంటార్రా, నువ్వోఅగవ్! పైగా, ఒక్కనాటికి రాదు మాట. ఏమంటావా? దస్తుసంగతి ఇంటిదగ్గిరే, దస్తావేజులు కచేరీలోగాని. రేటు తాతాచార్లవారిముద్ర, తలకాయకి తలకాయ్. వరోవిశేషం; నిత్యపంటరా. ఎండుములుగుల్తో నిమిత్తంలేదు. పోనీ, ఓరిసీల్లో జేరితేం, మనఊళ్లో? ఎంతసౌఖ్యం! నౌకావాసం; ప్రతినిత్యమూ చెక్కరకేళీలు; కాలవగట్టున ఎక్కడ పనసపిందె ముట్టినా, మీయింట్లోనే ఉంటుంది. ఏమనుకున్నావో గాని, కాలవతూములీసి నీళ్లువదిలావా, ఎంతమేరఖాతం.

తడిసిందో, అంతమేరా పరవర్త్రా రూపాయలూ, చాలనేవరకూ, పుష్కలంగానూ? ఇందులో ఏముంది మృత్తికా? అన్నింటికి మొహంవాచిపోవాలి. ఏంపని కేశావు! అయితేనూ జీతంఏమాత్రం ఒరీ?" అంటారు. అంటే అతడు ఏయెనభైయో అంటాడనుకోండి, రివైజ్డ్ స్కేల్ ప్రకారం. రివైజ్డ్ స్కేలు 80-10-30(క్రిందికి)— ముప్ఫైకే దొరుకుతాడుకాదూ మరి బియ్యే ఇప్పుడు. అంటే, అవతలవారు, "ఉన్నదిబస్తీగదా, ఒరీ, సాలుకి ఎనభై ఏంకిట్టుబడి నీకు?" అంటారు. అనగా, పామరుల అభిప్రాయం మేస్త్రీ చెయ్యడానికి బ్రతికిఉన్నవాడు, చేతులోనాడి అందుతూన్న ప్రతీవాడూ పనికొస్తాడుగదా అని. అల్లాంటిపనికి జీతం నెలకే ఎనభైకావడం వాళ్లబుద్ధి చచ్చినా ఒప్పుకోక, అది సాలుకి చాలని అనుకుంటూంటుంది. మేస్త్రీ చాలాఉన్నతమైనదీ, విశిష్టమైనదీ అని దారుణాస్త్రంచేసేవాళ్లు, తమరికి దీనియందు ఎంత అభిప్రాయం ఉన్నా, తమరు ఉండకూడదట మేస్త్రీలుగా. అంటే, ఇతర ఉద్యోగాల్లో ప్రస్తుతం ఉండే చాలామందికి, ప్రత్యేకంగా ఒకొక్క శాఖలో తెగపండిపోయిందిట తెలివి. అందువల్ల, మేస్త్రీ చెయ్యడానికి ఎవరో మామూలువాళ్లు కొందరున్నారుగదా అని తమరు ఇతర ఉద్యోగాలు స్వీకరించారట, దేశముయొక్క లెవెల్ ఎక్కువచేసి, ప్రజలకు వచ్చే యిక్కట్లకు ఆదుకోడానికి. ఇలాగంటి కారణాలవల్లనే. "మేస్త్రీకూడా ఒక ఉద్యోగమేనా!" అని సందేహాస్పదంగా పెట్టవలసివచ్చింది దీనిపేరు.

ఎల్లాగైతేనేమి, 'మేస్త్రీ ఉద్యోగమేనా' అని చర్చించేటప్పుడు, మొదట, ఉద్యోగం అంటే మానవుల సంకల్పం ఏమిటో చూడడం కర్తవ్యం. ఉద్యోగం అంటే గొప్పయోగం పట్టడం. కాబట్టి గొప్పపని. చాలామంది అభిప్రాయం శరీరంకంటె బుద్ధిగొప్పది అని కావడంవల్ల గావును కాయకష్టంకంటె తలపనే గొప్పదా అనుకోవలసివస్తూంటుంది. కాయక్లేశపడేవాడికి బుర్రబాధ ఎంతమాత్రం ఉండదుకాని, బుర్రప్రయోగం చేసేవాడికి ఎంచేతోకాని శరీరకార్శ్యం ఉంటుంది. అంచేత, తలపాగాగల ఉద్యోగం గొప్పదేకా! ఈరెంటిలో ఉత్కృష్టం ఫలానా అనిచెప్పడం సాహసం. ఏమైనా, జనసమూహంమీద కొంతఅధికారం చలాయించి, వారికి జీవితంలో కలిగే అవసరాల సందర్భంలో ఉపకారమో అపకారమో చెయ్యడానికివీలైన అంతస్థులో ఉండడమనేది ఉద్యోగం. కేవల ప్రాపంచికములైన, అప్పు ఆస్తులూ, రాబడి పోబడులూ గుర్తించి, జనులు యావన్మందీకూడా ఒకడు తమర్ని ఏమిచేసిపోతాడో అని హడలుతూన్నప్పుడు ఆ ఒకడు చేసేది ఉద్యోగం అంటారు. రాజవత్కృత ఉంటేనేకాని ఘనమైన ఉద్యోగమే కానేరదు. నియమితమైన వేతనం జోరుగా ఉంటూన్నకొద్దీ గొప్పఅంతరం ఉద్యోగంలో. జీతం ఎక్కువగా ఉండగానే సరికాదుటమళ్లీ; అది రోజూరోజూ ఇస్తే కూలి అయిపోతుందట; నెలనెలాజీతాలు తెచ్చేవేఉద్యోగాలుఅనికొందరు కూర్చోడానికి కుర్చీ, కాళ్లు తన్నిపెట్టడానికి బల్లా, వీలైతే పంకాగాలీ, కలిగి ఉన్నవన్నీ ఉద్యోగాలన్నారు. మొత్తంమీద ఉద్యోగాలు సంఖ్య పరంపర లాంటివి. ప్రతీసంఖ్యకీపైన మరోటి ఉన్నట్టు ప్రతీఉద్యోగానికీ పైన ఇంకోటిఉండి తీరుతుంది. అంటే, ప్రతీ ఉద్యోగస్థుడూ, కిందవాళ్లని కొందర్ని ఆరుమూడు చెయ్యగలిగితే పైవాళ్లకి కొందరికి అయిదుపది చేసితీరాలి. నెత్తిమీద వాళ్లు ఎంతతక్కువమంది ఉంటే అంత గొప్ప ఉద్యోగం. విలువగల పాగాఉంటే ఉద్యోగస్థుడే. కొంతదర్జా, కొంతరాబూ, దర్పం, పలుకుబడీ అవీనం ఉంటేనే కాని ఉద్యోగమే కాదు. అదీకాక, బిళ్లబంట్రోతులు ఉండాలిట, డవాలీలు అపసవ్యంగా తొడుక్కుని, "అస్మత్ పితుః ప్రాచీనావీతి" అన్నట్టు. ఆ డవాలీ పల్లెటిదిక్కువాళ్లని బెదరకొట్టడానికి నాటకం వగైరా శాలల్లోకి టిక్కెట్టులేకుండాప్రవేశించడానికీ, ఆలస్యంగావచ్చినా సభల్లో అగ్రస్థానం అలంకరించడానికీ, బల్లకట్లు ఊరికేదాటడానికీ, పడవల్లో ఒకటో నెంబరుగది ఖాళీచేయించడానికీ బహు ఉపచరిస్తుంది. మరిన్నీ బదలాయింపులు ఉండి అప్పటప్పట సర్క్యూటు వెళ్లవలసిన అగత్యం ఉండేది ఉద్యోగం. ఎల్లవెన్నులు మూటగట్టుకుని శరీరం నిమిత్తం అనగా తిండీతిప్పలూ వేషం, ఫోషక్, వీట్లల్లోఅయ్యే తగులుబాట్లకి కూడా ఎవరిమీదో విరుచుకు పడడానికి వీలుగలది ఉద్యోగం

కొందరు ఉద్యోగులు పల్లెల్లో పోగవుతూంటారు, పైవారికి జమమానుగోడా! కిటు. అటువంటప్పుడుఅక్కడ జరిగే ఖర్చుపద్దు వ్రాయడానికి చిత్రగుప్తుడైనా పనికి రాడుగదా. ఖర్చు చేసేవాళ్ళకి ఆవరకే ముట్టిందిట పదింతలు లెక్కలేదు. అనుభవించేవాళ్లకి లెక్కతోనే జరుగుల్లేదు. మనడబ్బు కాకపోతే మనం బహువిరివిగా ఖర్చుపెట్టగలం. కాఫీహోటలుకి మనమేవెడితే "రెండు వడలూ, అరకప్పుటీ, ఇనఫ్. ఊహూ, ఎందుకూ అంతకంటె" అనడం. ఇంకోడికి గస్టుగా వెడితే, మన నిమిత్తం పెసరట్లకోమూ, ఇడ్లీకోమూ కేటాయింపుగా జనం కూర్చునిమరీ తయారు చెయ్యాలి. అందుకని దేశంమీద సబార్లుచెయ్యడం ఉద్యోగం. పై పెచ్చు, కార్యకరాటులు వక్కా వచ్చినప్పుడు ధన ధాన్య సమృద్ధిగా కావలసినన్ని అరటిగెలలు, కూరలు, పాలు, పెరుగు, బియ్యం గోనెలు తెగసప్లయి అయిపోయేది ఉద్యోగం. కొందరు ఉద్యోగులు, అల్లాంటి సరఫరా బాపతులోది తమకు కావలసినది ఏదో కక్కుర్తిగా వాడుకుని, తక్కినది మర్నాడు కూర్లబజార్లో అమ్మించి డబ్బుచేసుకోవడం చాలామందికి తెలిసినదే. అందువల్ల, పైనదొరికే దేదో అదే ఉద్యోగమని ఘరానా మనుష్యుల ఊహ. ఈ పైన దొరకడం అనేది మహా గడుసు ముక్క. దాన్నే కొందరు కిట్టనివాళ్లు తేలిగ్గా "ఆఁ, లంచం" అంటారు. మరికొందరు, "ఆ ఉద్యోగిని చూవకున్నావా ఏమిటి? అవతలవాళ్లువచ్చి, బతిమాలుకుని, మిక్కిలి సంతోషపూర్వకంగా, తమ అవసరం నెరవేర్చినందుకు మీద పారేసిపోతూంటే, ఆ ఉద్యోగిని పుచ్చుకోక ఏంచెయ్యమన్నారు? అతడేమీ వెళ్లి అడగలేదు. అడిగితే, ఎవరయ్యా ఇచ్చేది? తోచివ్వాలిగాని అల్లాంటప్పుడు పుచ్చుగోనివాడు వాజమ్మ. అందుకనే, కొందరు రివిన్యూలో జేరితేంకి గుడికట్టుకుని కూర్చున్నాం అంటూంటారు. "ఫలానావాడు అంత మంచి లైనులో ప్రవేశించాడు. ఓ ఇకవై యెకరాలు ఏకఖండిక అంటిది ఆర్జించాడూ? అల్లా కట్టుగా ఉండడం ప్రజ్ఞా, లౌక్యమా, పోదూ." అని పెద్దపెద్దవాళ్లు అనగా వింటూంటాం. అందులో, జీతంకాక, పైన సంపాదించిన తోటా దొడ్డీ, ఇల్లూ వాకిలీ బట్టే ఉద్యోగికున్న తెలివి యొక్క దారుణత్వం, అఖండత్వం పైవారు మామూలుగా కొలుస్తూండేది. చాలా లంచాలు పట్టేవాడికోట ప్రమోషను. ఎంచేతంటే, వాడు మరీ పైవాళ్లకి లెక్కాపత్రం లేకుండా పాకయ్య గలడుట. ఈ పైనదొరకడాన్నే కొందరు బహుశ్రోత్రియంగా, గాంభీర్యంతో, 'బల్లకిందచెయ్యి', 'చెయితడి', 'రక్ష' అని వాడుతూంటారు. పైగా ఆపనిలోంచినివృత్తిమించగానే, ఆమనిషి కేవలం కోరలూడిన పాములా అయిపోకుండా, కాస్తో, కూస్తో పింఛను గలిగి ఉండేదే ఉద్యోగం. ఇంట్లో శుభకార్యానికి గాదు, పితృకార్యానికి గాదు, దేనికేనా సరే, "మావాడికి సెలవు దొరికింది కాదుట, రాలేదు" అని ఇంటి దగ్గిరవాళ్లు అనుకోవలసి వచ్చేది ఉద్యోగం. ఇంటిదగ్గిర పిల్లాపీచూ, ఒకణ్ణి, 'నాన్నా' అనకుండా, 'నాన్నగారూ' అని పిలుస్తూంటే, వాడు ఉద్యోగే. ఇంగ్లీషులు నేర్చినవాళ్ల అభిప్రాయం, ఇంగ్లీషులో చేసేదే ఉద్యోగమని. కాని, పామరుల ఉద్దేశం—పామరులు అంటే గ్రహపాటువల్ల ఇంగ్లీషురానివాళ్లన్నమాట-తెలుగులో చేసిందికూడా ఉద్యోగమనే. ఇందుకనే చెబుతూంటారు, పెద్దలు,—"వెనక, నా చిన్నతనంలో ఈ ఇంగ్లీషులన్నీ ఏడిశాయిటోయ్! కోరటులో వాదనలూ తీర్పులూ అన్నీ తెలుగునే టకటకలాడిపోయేవి. ఫలానావారు రాజమేంద్రీలో జడ్జీగాఉన్నప్పుడు మన ధర్మశాస్త్రాన్ని పురస్కరించుగుని వ్రాసినతీర్పు:—

"ఇవతలవేపు న్యాయవాదీ, అవతలవేపు వాదీ, బల్లబద్దలుకొట్టి, ఒకరిమీద ఒకరు అగ్నిహోత్రం లా అయిపోయి, కాట్లకుక్కల్లాగ కలియబడి జుట్టూజుట్టూ పీక్కోగా, చివరకి తేలిన సారాంశం ఏమిటంటే:" అంటూ ఉండేదిట. ఆయనచేసింది మాత్రం ఉద్యోగం కాదూ!" అని.

ఏదైనా వాహనం ఉంటేగాని ఉద్యోగం కాదని ఒకాయన. వాహనం అంటే, భగవంతుడు ప్రసాదించిన కాళ్లతోకాక, కూర్చున్నవాడు కూర్చుని ఉండగానే, ఒకడు (బతికిఉన్నఒకడు) తన ఉద్యోగస్థానం జేరడానికి సాధనం. అందుకు పెట్టిపుట్టిందే ఉద్యోగమని. వాహనాలు కలిగిఉండడానికి బృహజ్జాతకంలో!

చంద్రసూర్యవిలగ్నేషు బలవద్గ్రిహత ష్కభే,
పాపాయుక్తేన సశుభే యోగోవాహనసంజ్ఞితః.

అనిన్నీ,

ఆగ్నేయమర్కేళకటళ్ళ సాళ్యం
చంద్రే త్వభాప్యం సన్నమంచ వాహనమ్,
భౌమోయథార్కళ్ళ సితోయత్రేదు
ర్బధేతు మిశ్రంచ గజాదికం నరా.

అనిన్నీ ఉండడంవల్ల, గుఱ్ఱాలబండీ, ఎడ్లబండీ, ఏనుగో, ఇచ్చట చెప్పబడ్డాయి. 'గజాదికం' అన్నచోట ఆది శబ్దం ఉందిగనక కడమవన్నీ ఆముక్కగర్భంలోనే ఇమిడిఉన్నాయి అని వాదించవచ్చు—పైగా గజం చాలా పెద్దదికూడాను. కాని, సైకిలు, మోటారు, రైలు, ఎలెక్ట్రిక్ రైలు, విమానం, రిక్షా—అనగా అనంతనేనం, బోటు, ఓడ, వగైరా బోలెడువాహనాలు ఉద్గ్రంథాల్లో స్మరణేనా లేకుండా పడి ఏడుస్తున్నాయి. అంచేత ప్రస్తుత జాతకాలు కొన్ని పరిశీలించి From the particular to the general ప్రకారం

సితేందు మోటార్ కారెండు సైకిల్
సితభౌమమిశ్రంచ రిక్షాచ ట్రామ్‌కార్

లాంటి ప్రమాణాలుచేసి పెద్దగ్రంథాల్లోకి ఈపాటి ఎక్కించెయ్యాలి సాహసించి. లేకపోతే ఇల్లానే ఉంటూంటుంది; ఇవన్నీ పూర్వోక్తవాహనాలు కావు పొమ్మంటూంటాడు ఎవడైనా మరోముక్క. కొందరు తమస్నేహితుల వాహనంలో చక్కాపోవడం కద్దు దీనికి అనుగ్రహం కాక ఏ ఇతరగ్రహబలం ఉండాలో విమర్శించాలి. సరి, వాహనంగాక, బిరుదులు, దర్శనం ఓపట్టాన్ని దొరక్కపోవడం, చిట్టచివరకి నాలుగురూపాయల పుష్యోక్నైనా సరే నియమించడానికి పవర్ గలిగి ఉండడం వగైరా లక్షణాలు మిక్కిలిగా ఉన్నాయి ఉద్యోగానికి. నిరంతరదాస్యాలైనవే ఉద్యోగాలైనప్పుడు పరమస్వాతంత్ర్యం, స్వేచ్ఛా కలిగినవి ఉద్యోగాలనడానికి ఆటంకముండకూడదని కొందరి మతం.

ఇక మేష్టరికి ఈలక్షణాలు సంధించి చూడక పూర్వం ఏఉద్యోగపుచదువు మంచిది? అని జనుల్లో అనుకునే ప్రసంగం కొద్దిగా చేద్దాం. ఒక్కొక్కకాలంలో ఒకొక్కఉద్యోగపు చదువుఫాషన్‌లో ఉంటుందిట. ఫాషన్ అంటే జనుల నవ్యాభిరుచులనుబట్టి వేసాదికంలో ఉండే భేదవిశేషం. కొత్తఫాషన్ ఎంతబుద్ధిలేనిదో పాతదికూడా అంతబుద్ధిలేనిదే సరిగ్గా. కాని పాతఫాషన్ అంటే నవ్వొస్తుంది ఏమోగాని, కొత్తవారికి మరికొత్తఫాషన్ వారొచ్చి తమర్ని చూసి గుక్క లెట్టే వరకును ఈఫాషన్ల చొప్పున మార్పులునూచిన్నాండే వారి ఊహ భూమియొక్క నాజూకుతనపుభారం తమ భుజాలే మోస్తున్నాయని. ప్రపంచంలో కడమవాటికి మల్లేనే ఉద్యోగమూను. పైమీద వేసుగోడానికి ఆ మధ్య పెద్దజరీ అంచుకండువా, కొన్నాళ్లు నేతసరుకు, తరవాత సిల్కు, ఇప్పుడు అత్తాకోడలూ అంచు నేలం కండువా, సిల్కుది. (మరా:—అంతా ఖద్దరు డ్రెస్సయినా, దానికిమాత్రం ఎక్జెమ్షన్‌ట). ఆమధ్య మొగాళ్లకి మురుగలూ, దుద్దులూ, దండకడియాలూ, బిళ్లల మొల్తాడూ, తాళంచెవి గొలుసూ, కొన్నాళ్లు ఏమీలేక పోవడం, మహాఉంటే ఏదోఉంగరం ఉండడం. ఇటీవల తెల్లరాళ్లూ ఎర్రరాళ్లూకలిపి చెక్క కొంచెం వదులుగా ఉండి ముంజేతిమీద పడుతూండే బంగారపు గొలుసూ, కుడిచేతికి. కొందరు అందులో ఆరాళ్లు తమ పేరులో వున్న అక్షరాలని స్ఫురింపజేసే ఆకారంలో తాపిస్తున్నారట, పేరు మీదు గట్టినట్టు. ఈమధ్య లగ్గసరికి అయిన పెళ్లిళ్లజోరులో ప్రతీపెళ్లికొడుకూ అలకపానుపుమీద దీనికోసమేట పట్టుట్టడం. నా చిన్నతనంలో వీథిపాటల్లో 'అల్లుడా మేనల్లుడా' వుండేది. తరవాత 'ఏదిరా నాసీత'; పదపడి 'చల్ మోహనరంగా'; ప్రస్తుతకాలంలో "అపనా తనామనా" అనేది తోచనీకుండా హోరెత్తిస్తున్నారు సజీవులైవున్న జనం మాత్రం-అంటే పుట్టేసినవాళ్లూ కడుపులో ఉన్నవాళ్లూను. అరీలిగానే, మరీ ఆమధ్య రివిన్యూలో జేరితే నేచాలని కొన్నాళ్లు క్రిందటతలతాక ట్టైటయినాసరే ఓరిసీలు పరీక్షకెళ్లాలని, కొన్నాళ్లు రిజిస్ట్రీకి యత్నించేసి తీరాలని, అళంగుదాకా సంచీ చిమ్ముతూ అయినా సరే వెళ్లి. సూక్ష్మంలో రైలైతే రైలు ఇలాకా మంచిదే అని కొంతకాలం; ఇంగ్లీషువైద్యం చదవడం కొన్నాళ్లు; అంటే, ముందస్తిగానే, వైద్యబృందం వెలువడి అదివరకు ప్రపంచంలో ఎవ్వరూ ఎరగని కొత్త వ్యాధులూ, కొత్త పిపీలికలూ, వాటికి లాటిన్ నామధేయాలూ సృష్టించి ఆ దరిమిలాని వైద్యం చెయ్యడం. పదపడి, బొంబాయి కెళ్లిపెళ్లి వర్తక సరళిచదవా

లని. ఇటీవల చెన్నపట్నం స్కూల్ ఫైనల్కి అప్లైలు కోసం కలకత్తా ప్రయాణమూ, అక్కణ్ణించి మిత్రవండలి ధైర్యంతో వెనక్కి మళ్ళడం ఫాషన్ అంటోచ్చారు. ఏమాత్రం పైసా ఉన్నవాడైనా, బియ్యే అనడంతోటే As a matter of course లా కాలేజీలో జేరడం ఫాషన్-అంటే శ్రీమంతులికి లాచదువు నిత్యవిధి లాంటిది. లాచదువుకి ఏయుగంలోనూ కాలదోషం లేదుట. మేష్టరీచదువు ఏకాలంలోనూ ఫాషన్లో ఉండేటట్టు కనపడదు. సాధారణంగా ఇతరవాటిల్లో తెగ ప్రైచేసి, ఎక్కడాకూడా చేపకపోతే, వరిచేసేదిలేక, హైసర మజ్జా అని ట్రైనింగులో చేరి, తరవాత మేష్టరీ సంపాదనకోసం దేశాటన చెయ్యడం కొందరు మానవులకి పట్టిన అదృష్టంలా కనిపిస్తోంది. కాకపోయినా, చదువుకున్న పెద్దలుకూడా, ట్రైనింగు అయే మేష్టర్ని ఇల్లా అడుగుతూంటారు; "ఏమండీ, మిష్టర్, మీరు ఈ దిక్కుమాలిన ట్రైనింగులో జేరారేమిటి, జీనియస్ రాట్ అవడానికి?" అని, అడిగితే, "ఏముంటోనండి; Circum stances permit చెయ్యలేదండి, Some-thing is better than nothing, ట్రైనింగు అయి ఉండడం ఎందుకైనా మంచిదండి" అంటారట కొందరు. కొందరు "కడుపు వాట్లుకైతే చేతి చిలుం వదుల్తుంది. దీని కయితే ఏదో కొంతవరకు మనోవర్తి పారేస్తారుగదా, దాంతో తిండి వెళ్ళిపోతుంది, విశేషించి దూరాభారం వెళ్ళక్కర్లేదు, రాజమండ్రీ, గౌతమీతీరం, పోనీ ఏదో కొన్నాళ్ళు గోదావరీస్నానం, ఈ నీళ్ళుప్రాప్తం ఉన్నాయి గావును" అన్నారట. నే చెప్పేది వెనకటిమాట. అప్పుడైనా, అంతర్యాల్లో ఉండే ఊహాలట అల్లాంటివి. పైకి ఇవెవ్వరూ ఒప్పుగోక ఓపట్టాన్ని, బోధయందు తమరికి ఉండే ఆయొక్క ప్రియంకొద్దీ ట్రైనింగు అవుతున్నాం అనేవారట. నిజంగా. బోధన అంటే గరి ఉండి తరిఫీయతు అయేవారు ఉంటమ్చున్నాండీ ఎప్పుడూ కూడా.

అవునా, జనాభిప్రాయాన్ని అనుసరించి, ఉద్యోగాని కుండవలసిన లక్షణాల్లో మేష్టరీకి ఒక్క లక్షణమూలేదు ఓం ప్రథమం. ఇందులో పైన ఏమీ దొరకదు. ప్రపంచంలో నిమిత్తం లేదు. అందుకని రక్షలేదు, గొడుగు లేకుండా స్కూలు కెడుతూంటే సూర్యరశ్మి తప్ప. కడంఉద్యోగాల్లో చేరడంనిచ్చెనఎక్కడం, మేష్టరీలోచేరడండాబాయెక్కడం. మరిపైకిఎగరడానికివీల్లేదు ఇటూ అటూ చలించడం మొదలెడితే, అసలే క్రింద పడడం. దీనికి ఎదుగూ బొదుగూ లేదు. అంటే ఇది గొట్టెతోకలాంటిది. ఇన్నిస్పేట బ్యాండు లాంటిది: మన 'అపనా తనామనా' లాంటిది. బంట్రోతులు ఉండరు. ఏమీ సప్లయిలుకావు. పలుకుబడి ఉండదు. పెరుగుతూండే ఖర్చులు కడిగిఇచ్చే మొత్తంకె జీతంలోనే భరించుగోవాలి. మాట్లాడకూడదు. మాట్లాడితే త్రికరణశుద్ధిలేపోవడం అన్నమాట. శుభాశుభాలు ఆజీతంలోనే; లిప్టన్ అందులోనే; ఎలిఫెంటు అందులోనే; రోగాలూ రొచ్చులూ అందులోనే; దేవుడు ఖర్చూ దెయ్యలఖర్చూ అందులోనే; సంసారం అంతా అందులోనే. దేశం అందులోనే. ఆస్తులు లేనివారసు తద్దినాలూ అందులోనే; దేవారసు తద్దినాలూ అందులోనే. ఒక్కటే వాహనం సాధారణంగా, పెద్దది. అన్నీ సెలవలే—ఎందుకూ? ఈస్థితి ఆలోచిస్తూ కూర్చోడానికి. అంతాపిల్లలే. కాని, మేష్టరీవల్ల దారిద్ర్యం అబ్బుతుందా? లేక దరిద్రుడైన తరవాతే మేష్టరీలో చేరతాడా? అని సందేహించారు కొందరు. ఎటుబడితే అటే వాదించవచ్చు, అసలువాదించడం అంటే ఏమిటో తెలిస్తే అన్నాడొకాయన. 'దరిద్రుడు' అంటే రెలెటివ్ గా సుమండీ. జగత్తంతా ఆయొక్క 'రెలెటివిటీ' యేకదండీ! ఏమైనా మనంచెప్పలేం. మనజ్ఞానం చాలా పైకి ఎగరుతూంటుందికాని, కొండొకచో పోట్లు అవుతూంటుంది. అల్లాంటప్పుడు ఏమిటి చెప్పడం? వెనక వాళ్ళకి తీర్థపురాచ్చిప్పలమీద ఆపేక్ష ఎంచేత? దోమలకి మానవుల చెవులంటే సరదా ఎంచేత? అల్లానే, దారిద్ర్యానికి మేష్టరీ అంటే ఇష్టం. అందెప్పుడూ, నోట్లు (ఆఫ్ లెసన్సు అంటారు వాట్ని) వ్రాస్తూండడం ఒక తారాక్కణేమో అందుకు.

మేష్టరీ పామరులకి ఉద్యోగంలానే కనబడనిది అయినా, పదశక్తివల్ల మనం అనుకునే ఉద్యోగాలన్నీ టిల్లో ఇమిడిఉన్నాయని ఋజువుచేస్తాను చూడమన్నాడు వకొకాయన అని మొదలెట్టాడు. మేష్టరు—డాక్టరు; తరుచురోగం కుదర్చడమేకాక, అంతకంటె

తరుచు చావకొడుతూంటాడు గనక. మేష్టరు—ప్లీడరు; దీనికి మేష్టరీ ప్లీడరీ రెండూకూడా తరిఫీదులై మారకుండానో, లేక ఒకదాన్లోంచి ఒకదాన్లోకి మారో, ఏదో ఒకటిచేస్తూన్నవాళ్లు కొంతసాక్షి. అదీగాక, మేష్టరు ప్లీడరికి మల్లేనే తలకాయలు మారుస్తాడు. ఎట్లాచ్చి, ప్లీడరు ఒకరితలకాయ మరొకరికి మార్చగలడు: "హరిమైసాదిశిరంబు సాదిమెయి జాత్యశ్వోత్తమాంగంబు" అన్నట్టు. మేష్టరు ఒకతలలోనే మార్పు తేగలడు వెనకటికీ ఇప్పటికీ—మార్పు, అయితే మంచికీ, లేకపోతే చెడ్డకీ" పైగా, మేష్టరు, జడ్జీలాగ తీర్పులుచెప్పి, పోలీసులాగ చోరీలుపట్టుగుని, మేస్ట్రీటులాగ దండించి జరిమానావేసి, కలెక్టరులాగ వసూళ్లుచేసి (జీతాలు) కుఱ్ఱాడిమనస్సుమీద ఎంతఅధికారమేనా కలిగివున్నవాడను. తిట్టడానికీ దీవించడానికీ, మెచ్చుగోడానికీ నిరసించడానికీ అన్నింటికీ ఒకడే గనక కొందరు కుఱ్ఱాళ్లకి మేష్టరు దేవుడు; చాలామందికి దెయ్యం. చివరకి, ఆయన అన్నది మేష్టరీ చిన్నసైజులో 'సర్వజ్ఞత్వం' అని,

సరే జీతంకాక మేష్టరీలో వున్న ఇతర లబ్ధి చూసేసి, చివరకి చక్కా-పద్దాం. ఒకటి: పుస్తకాలు చెయ్యటం. పుస్తకాలువ్రాసీ, నాటకాలుపెట్టీ, కార్లువేసీ బాగుపడ్డవాళ్లు బహు అరుదు. పుస్తకాల వ్రాతలకి ఒకానొకచో కోర్టువర్ణనంకూడా అవుతోంది. రెండు: పెద్దపరీక్షలపేపర్లు దిద్దడం. అది సౌఖ్యమో, యమబాధో చెప్పడం కష్టం! జీవితంలో ఒకసారి పడ్డమేష్టరు మళ్లీ పడడు సాధారణంగా మశూచిలాగ. అదైనా, యావన్మందికీ అందుతుందా? దానికెన్ని మారాముళ్లూ! బ్రాహ్మణాబ్రాహ్మణ సమస్య, అందులో ఏముందిగాని వుత్తరాది, దక్షిణాదిసమస్య తీవ్రంగ వుండి, ఉత్తరాది అంటే సిఫారసు వుత్తరాలు వగైరా; దక్షిణాది అంటే దానోపాయం వగైరా. కొందరికి అయితేం, మూడు: పరీక్షలకి సూపరింటు అవడం. రొండు మూడు రోజులకూలి నాలుగైదుమాసాల్లో పొందడం. ఈలోపున హెచ్చుతగ్గు పరిశోధనలు చేస్తే, వెంటనే దవడశుద్ధీ. ఇంకా టైముంటే మేడలాంటివి దిగవలసి వస్తే దేహశుద్ధీ రుచిచూడ్డం. నాలుగు: ప్రతి చోటా ట్యూషన్ ఒక మార్గం. మేష్టరీలో అన్నీవిపరీతాలే. గవర్నమెంటు వుద్యోగి అయినాసరే, లా, వైద్యం లాంటి కొన్నిశాఖల్లో అయితే ఫర్వాలేదుట, ప్రైవేటుగా ప్రాక్టీసుచేసుగోవచ్చుట స్వంతానికి. మేష్టరీలో అయితే, బోధనకి వచ్చేటప్పటికి నవ్యతచెడిపోయి మరీ బాగుండే బోధన సిద్ధించదట; ప్రైవేటువ్యాపారాలు ఎంతమాత్రం కూడదట. మేష్టరు ఏంచెయ్యాలో, ఎల్లాచెయ్యాలో, అడ్డమైనమనిషీ శాసించేవాడే, ఈమేష్టరీ పురస్కృతం ఏమోగాని. అల్లాంటిట్యూషను అనగా బోధనావ్యభిచారం ఒకవేళ కూడినా, ఎంతడబ్బు లాగుతున్నాడో చెబుతూ దరఖాస్తు పెట్టుగోవాలట. ఏమీ పుచ్చుగోకుండా, ధర్మార్థం పనికొచ్చేకుఱ్ఱాడు గదా అనుకుని ప్రైవేటుగా చెప్పినా, దానికి దరఖాస్తుకావాలి. దరఖాస్తులేకుండా ఆఖరికి ధర్మమేనా చెయ్యడానికి వీలు లేకపోవడం ఒక్క మేష్టరీలోకనపడుతోంది ఇంతఅపనమ్మకం మేష్టరుమీదఉంచి, మీకేమండిపోయిగాను, మీ వృత్తిచాలా 'నోబిల్'అనిపెదవులతో అనేసి కన్నుగీటుతూండడం మేష్టర్ని తృప్తిపరచడం కాదు. "ఉంటే ఎంతైనా ఇవ్వవలసిందే, నీ కింతకంటె జీతం ఎక్కువ ఎందుకు? రూపాయిలు ఎంజేసుకుంటావు? నువ్వెళ్లిపోతే నీజీతంతో నీతాతల్లాంటి వాళ్లని ముగ్గుర్ని కొనుక్కుంటాం" అనే మోస్తరికి దిగి మొదటి ఖంజాయింపుల్లోనే మేష్టరీ శుద్ధవర్తకవ్యాపారమై పోయినప్పుడు, "మేష్టరు త్యాగం చెయ్యాలి. చేస్తే వాడి వంటికి చాలా మంచిది. బోధన "ఐడియల్"గా—అనగా భూమిమీద లేనిదానికి మల్లే ఉంటూండాలి అని అర్థంలేని పురమాయింపులు చెయ్యడం అనాలోచితం కాదూ? మేష్టర్ని సర్వాధికార్నిచేసి, 'అయ్యా, నీచిత్తం నాభాగ్యం' అని చేతులు హృదయపూర్వకంగా జోడించినప్పుడు తప్ప మేష్టరు దగ్గర త్రికరణశుద్ధి దొరకదేమో అసలు? అట్లా త్రికరణశుద్ధి లేకనేకదూ, మొదట ఇందులో చేరి, ఒకటి రెండేళ్లు కుఱ్ఱాళ్లమీద 'ఎక్స్పెరిమెంట్లు' చేసి, ఇది జీవితం అంతా తమకి శాశ్వతం అయిపోతే తమరు అల్లానే ఉండి పోవాలి ఫర్లాంగు రాయిలాగ అని గావునుగా చాలామంది ఒకపు దొరికినప్పుడు. అది వదిలిపెట్టి కడమావృత్తుల్లోకి సర్దుకుంటోచ్చేదీ! ప్రస్తుతం ఇతర ఉద్యోగాల్లో ఉంటూన్నవారు చాలా

మట్టుకి మొదట్లో కొంతకాలం ఏ చిక్కుల వల్లయితేం మేష్టరీ పనిచూసిన వారేగా? కాని ఒకటి. అప్పట్లో, మనిషికి నచ్చిన పని ఖాళీపడే వరకూ మేష్టరీ ఓటి తేరగా ఉండేది. అందుకని చేరేవారు. ఇటీవల అట్లా వీలు కుదరటం లేదు. ట్రైనింగు అయినా సరే టికాణా లేకుండా ఉంటే, పట్టే వాళ్లమాట లెక్కేమిటి! కాని ఇక్కడొచ్చిన పేచీ. మేష్టరీ చేసివస్తేగాని ట్రైనింగులో సీటు ఇవ్వరట. ట్రైనింగు అయి వస్తేగాని మేష్టరీ ఇవ్వరట. ట్రైనింగు అయింతరవాత ఏమి చెయ్యడానికీ తోచటం లేదు చాలామందికి. కొందరు, ఊళ్లు తిరగడం మానేసి, అదెట్టి పైవారికి రాసిచ్చిన బాండు రద్దు చేయించి, ఇతరం చూసుకుంటే శ్రేష్ఠం అంటున్నారు. కొందరు "ఏమిచ్చినా సరే బోధనవర్షం కురిపించక మానం" అని గ్రహస్థితి వల్ల కష్టకాలానికి ఎంతకైనా మెత్తపడుతున్నారు. కొందరు గడుసర్లు "మీ స్కూల్లో ఫలానా ఆయన వెళ్లిపోతాట్ట, తక్షణం వెళ్లమనండి. నేను అఖండిపిండాన్ని. ఏదిపడితే అది చెబుతూ స్కూలు ఫైనలు లొంగదీసుకుని మూడు చెరువులనీళ్లు తాగిస్తాను" అని దరఖాస్తులు బారెట్టి చూస్తున్నారు. కొందరు "రెండుమూడు సంవత్సరాలు పెందరాళే పుట్టించీకపోతివేమిరా, బ్రహ్మదేవా!" అనుకుంటున్నారు. "ప్రస్తుతం ఇల్లాఇల్లా అయిందండి సంగతి. ఇల్లా మేష్టరీ వుంటే మీపనే బాగుందండీ. నెలకి ఇంతాఅని నియామకంగా ముట్టుతోంది ఏదోఓటి" అని వీళ్లని స్తోత్రంచేసే సరికొత్తక్లీడరూ వుంటూంటాడు

అయితే వస్తుతః సర్వకాలసర్వావస్థలయందూ కూడా వుంటూన్న కొన్నికొన్ని విశేషాలూ నైసర్గికాలూబట్టి మేష్టరీ ఎప్పుడూ ఇల్లావుండేదే అని సకారణంగా గ్రహించి మనస్సమాధానం తెచ్చుగోవచ్చు. మేష్టరీఅనగా ఏదోపద్ధతి పుస్తకాల్లో వండిపెట్టినసంగతులు పాఠవి కుర్రాళ్లకి వడ్డించడమనీ, అజ్ఞానం అనే పేరుతో అందరిమనస్సులకీ వుండే సామాన్యరోగానికి మందెయ్యడమనీ, సృష్టించడం అనేది లేక అదివరకే సృజింపబడి వున్న కుర్రాడి తెలివి ఊరికేగొడారివాడులాగ బాగుచెయ్యడమనీ, కుర్రాడు జ్ఞానార్థం బయులుదేరుతూన్నప్పుడు ఊరికే చూపుడుమనిషిలాగ లాంతరు చేత్తోపుచ్చుగు నడవడమనీ వగైరా వుపమానాలు సంధించి అల్లాంటిపనులు చెయ్యడానికి బ్రతికున్నవాళ్లు ప్రతివాళ్లు పనికొస్తారని మూర్ఖులూ జ్ఞానులుకూడాఅనుకుంటూన్నంతవరకు మేష్టరీకి గణ్యతతలక్రిందైనారాదు. మాప్రజలు జ్ఞానులు కావాలి, మాప్రజకు బోధకావాలి సమర్థుణ్ని అందుకోసం తేవాలి, వాళ్లని తృప్తిపరచి వాళ్లకి సర్వస్వాతంత్ర్య మియ్యాలి, మాదేశం అభివృద్ధి కావాలి, మామతం,మాభావ,మాసర్వస్వం అనే మోస్తరుగా 'మా' అనేది పుడితేగాని, అహంకారరహితమైన 'మా'అనేది, మానుషత్వాన్ని సార్థకంచేసే 'మా' అనేది పుడితేగాని, 'మే' అనేదిపుట్టి మేష్టరీకి మన్నన గలగదు. అప్పుడూ అనుమానమే. దీనికి చాలాకారణాలు ఉన్నాయి. ఇది కడమవృత్తులతో పోలిస్తే, ఇది ఇట్లా ఎందుకుంటుందో బోధపడుతుంది. కడమ వృత్తులు పెద్ద వాళ్లతో పని. మేష్టరీఅంటే అజ్ఞానులతో ప్రమేయం. పాపం ఒకాయన ఒళ్లుమండిపోయిగావును,'మీరేంచేస్తున్నారండీ?' అని అడిగితే 'దూడల్ని కాస్తున్నానండీ' అన్నాట్ట. అజ్ఞానితో ఏమిహెచ్చుతగ్గువచ్చినా జ్ఞానిదే తప్పు. కాబట్టి, అజ్ఞాని ఏమిచేసినా, జ్ఞాని అందుకు ఓర్చుగోవాలి, తిన్నికానట్టు.

తిట్టికొట్టిరేని తిరిగి మాటాడక
అట్టుఇట్టుచూచి అదిరిపడక
తననుగాని యట్టు తత్తరపడకున్న
నట్టివాడు బ్రహ్మమౌను వేమ.

అన్నదానిలో 'మేష్టరౌనువేమ' అనివేసుగుంటే కుదురుతుంది.అజ్ఞానానికివిలువ బాలుడుకట్టలేడు.కట్టగలతండ్రి వగైరాలు అప్పుడు అక్కడ ఉండరు. అందుకని బోధన అమూల్యం. కడమవృత్తులు ఒక్కడి పనే. బోధన ఇద్దరి తెలివితేటల వ్యవసాయం, ఉమ్మడి వ్యాపారాల్లో ఎప్పుడుమాట దక్కేడిసింది? మేష్టరు తన తెలివిపిల్ల కుర్రాడికి తెలిపింసనీ, పైగా, 'తెలిసిందాకా బ్రహ్మవిద్య, తెలిసింతరవాత కూసువిద్య.' కొన్నాళ్లయింతరవాత, అందుకనే, కొందరికి, తమరి చిన్నతనంలో మేష్టరు తమరికి చెప్పేడిసిందేమిటి, అనిపిస్తుంది. కాని, ఆ గురువుమాత్రం, ఆ క్లాసుకే జీవితం యావత్తూ బోధచేస్తూ—అంటే, క్రితం జన్మలో మేష్టరు ఒకక్లాసే

తెగఫేలయి ఉంటాడు, అందుకనే ఈ జన్మలో అది అన్నేనేళ్లు చదవవలసి రావడం—చిన్నతనంలో తన దగ్గర చదువుకున్నవాడు పైకొచ్చి అక్కరకొస్తే, సందర్భవశాన్ని, 'ఫలానా ఆయన పూర్వం నా స్టూడెంటున్నండి' అని ఎవ్వరూ అడక్కపోయినా చెప్పుగుని మురుస్తూండడం తప్ప ఏమీ కోరకూడదు మేష్టరు. అది స్వత్వం చంపుగుని అన్యత్వం కోసం చేసిన ఎంతత్యాగమో అనుభవించిన వాళ్లకి మరీ తెలుస్తుంది. తమర్ని చూసుగుని మేష్టరు ఎంత ఇసవుతూన్నా, కొందరు ప్యాసవడంతోటే గురువుని జ్ఞాపకం పెట్టుగోరు, పాపం ఎరగనట్టూ, చూడనట్టూ నటించి, మొఖం పక్కకి తిప్పుగు పోతారు; లేకపోతే ఓ నమస్కారం ఖర్చుపెట్టాలని. 'గురువు' అంటే 'తండ్రి' అనికూడా ఉండడం వల్లేమో ఈ ప్రమాదం. జ్ఞాపకమే పెట్టుగోనప్పుడు, ఇక మేష్టరు తనకి వెనక తన అజ్ఞానాంధకారం వదలగొట్టినందుకు ఇప్పుడు ఉద్యోగంలోకి వచ్చి డబ్బు గణిస్తూన్న ఆతడు మేష్టరికి డబ్బిస్తాడా? మేష్టరు పుచ్చుగుంటాడా? లోకజ్ఞాన సముద్రుడైన వేమన్న ఈసంగతి వ్రాసి తీరాడు.

గురువునకును పుచ్చకూరైన నివ్వగు
అరయ వేశ్య కిత్తు రర్ధమెల్ల
గురువు వేశ్య కన్న గుణహీనుడేమొకో
విశ్వదాభిరామ, వినర వేమ.

అని ఆమోస్తరుగా, కుర్రాడు, వెనక నేను ఫీజు కట్టేశాను పొమ్మంటాడు. పోనీ, అది వాడి దగ్గరనుంచి పుచ్చుగున్నాడూ మేష్టరు? అబ్బే! పిట్టపోరూ పిట్టపోరూ పిల్లి తీర్చాలి. నాడూవీడూ కాక మరోరుంటారు ఇచ్చి పుచ్చుగోటాన్ని నిర్ధరించడానికి. వార్ని పబ్లీకు మధ్యవర్తులనచ్చు. మధ్యవర్తులు మన్ననలు చేస్తారూ! ఇంత అవకతవక ఎందులోనూ లేదు. కడమా వాటిల్లో లోపాయికారీ మధ్యవర్తులుండి బేరాలు పైసలు చేస్తారు. ఇందులో ముందు మేష్టరే, 'నేను చెబుతానండోయ్' అంటూ తయారవుతాడుగాని, ఆ పిల్లాడు వచ్చిగాని, వాడి తండ్రివగైరాలు వచ్చిగాని 'బోధించండి బాబూ' అని ప్రార్థించరు. ప్రార్థన మీద ఎవడెక్కడికి వెళ్లినా వాడిమాట వేదమే. పిలవకుండా వెళ్లినప్పుడు గెంటకుండా పొమ్మనడమే కష్టం. మరొకరు 'పోనీ'కడమా చాలామందికి మల్లే మేష్టరూ బల్లకడితే, పదవికి హోదా ఎక్కువవుతుంది. అందరూ వచ్చి, "అయ్యా మేం అజ్ఞానంవల్ల బాధపడుతున్నాం, కాస్త ఆరోగం కుదిర్చి పెట్టండి" అని అడగడంవల్ల, అన్నారు. అల్లాయితే ఇతర లాభనష్టాలు ఉన్నా, కుర్చీలకీ బెంచీలకీ ఒక్కబల్లముక్కైనా దొరక్క చావవలసి ఉంటుంది పొమ్మన్నాడు ఇంకో ఆయన. అదీగాక, 'కడమవృత్తుల్లో పన్లు కళ్లకికనబడతాయి, బోధన కనపడదు' అంటే, 'ఆతోటమీద మీకు హక్కుభుక్తాలు శాశ్వతం చెయించాను చూశారా నాతడాఖా' అని గాని, 'వెనక. మీరు శవాకారంలా ఉంటే మిమ్మల్ని మెల్లిన్సపుడ్ కుర్రాడు బొమ్మలాచేశాను' అనిగాని, ఏలాయరేనా, ఏడాక్టరేనా అనుకోవచ్చు ఒకరితో, ఆనకానక. కాని, మేష్టరు, కుర్రాడి తండ్రితో, 'చూశారూ, మీకుర్రాడి మనస్సు చాలా ఇరుకుగా ఉంటూంటే నేను దానికి వ్యాప్తిఇచ్చి వైశాల్యం పెంచాను' అంటే పామరుడైతే 'ఛీ,పో' అంటాడు. తెలిసినవాడైతే 'మీరొక్కరేకాదు లెండి, మావాడూ కృషీ చేశాడు' అంటాడు. అందుకని మేష్టరీ పనిలో చేసింది చెప్పుగోడానికేనా ఉండదు. మరోటి: కడమావాటిల్లోకి మల్లేకాకుండా, ఇందులో, ఆ ఇచ్చేదానికే, చెప్పిందేచెప్పి చెప్పిందేచెప్పి తెగర్లిల్లు చెయ్యాలట. ఎవడికి ఎన్నిసార్లు కావలిస్తే అన్నిసార్లూ చెప్పే సర్వజ్ఞుడు కావాలిట మేష్టరు. డబ్బు సంగతితెస్తే అపవిత్రంట. ఇన్నిసార్లు చెప్పడంవల్ల బండకుర్రాడు ఏం బాగుపడతాడోకాని, ఈ అలవాటు మేష్టరికిపట్టుగుని, ఇతడు ఇతరజనంతో మాట్లాడేటప్పుడుకూడా చెప్పిందే చెప్పి మాటతెమల్చక జనాన్ని చంపేస్తుంటాడు. ఎన్నిందాల గాలించి చూసినా, మేష్టరీలో ఇహసౌఖ్యం వున్నట్టు తోచదు. అంటే సన్యాసిఅయినవాడు మేష్టరీపదవికి తగున సరిపోతాడు, అడక్కపోడం అటుంచి ఇచ్చినా పుచ్చుగోకుండాను. అందుకనే పెద్దపెద్ద గురువులూ, ఆచార్యులూ, యతులూ, స్వాములూను. కాబట్టి, మేష్టరు, శరీరంలో కాకపోతే పోడాపోయిరి- అనవమం మనస్సులోనూ, తప్పని సరిగా ఆత్మలోనూ సన్యాసి అయితీరాలి, డబ్బుసంగతి నోరెత్త

కుండా, పరసౌఖ్యం మోక్షం సిద్ధిస్తాయి, "పరముకన్న కేమి పావనమా సౌఖ్యం" అనే నమ్మకంతో స్వార్థంవీడి పనిచేసేవాడు మేష్టరు. మేష్టరీ దేవుడు మెచ్చుకోవాలి గాని మానవుడు మెచ్చడు. జ్ఞానంతో జోక్యం లేని వాళ్లు మేష్టరీ వుద్యోగమే కాదంటారు. కాని, అది మనకి కనబడే ఈ పాపపు ప్రపంచానికి నెత్తిమీద ఉన్న అమలిన బాలహృదయ రాజ్యానికి సర్వాధికారమని గ్రహిస్తే; దాన్ని వుద్యోగము అనవచ్చు. అహాఁహాఁ, దాన్నే వుద్యోగమనాలి. అందులో ఈకాలంలో మరీను. ఈకాలం ఎడ్యుకేషన్ ఎవరిచేతుల్లో వుందో తెలియనికాలం. ఒకటి: గవర్నమెంటు వారిని గ్రాంటు కోరకుండావుంటే వారికి చాలు, వారికి "ఎడ్యుకేషన్" ఎల్లా వున్నాసరే. రెండు: వారితరపు ఏజెంటుఅనగా ఇనస్పెక్టరు కొత్త పద్ధతులూ, పాటాలిస్తూవుంటే ఆయనికిచాలు, "ఎడ్యుకేషన్" ఎల్లా వున్నాసరే. మూడు: మేష్టరు. ఈయనికి ఒకటోతారీఖూ, ఆరోజున జీతంరాళ్లు సరిగ్గా వుంటే చాలు, "ఎడ్యుకేషన్" ఎల్లావున్నా సరే. నాలుగు: విద్యార్థి. ఇతగానికి సంతర్పణక్రింద మార్కులు కురిసిపోతేచాలు, "ఎడ్యుకేషన్" ఎల్లావున్నాసరే. అయిదు: విద్యార్థితండ్రి. అతగానికి వాళ్లఅబ్బాయి ఆకాస్తమెట్టు పాటి మేష్టరు కటాక్షంవల్ల పైక్లాసులో పడితే చాలు "ఎడ్యుకేషన్" ఎల్లావున్నాసరే. ఆరు: ఇతరులు, ఈ ఇతరులికి ఏమీఅక్కర్లేదు; ఇప్పుడంతా నాన్సెన్సు, ఫ్రాడైపోయింది, తమరు చిన్నప్పుడు చదివినచదువే చదువంటారు. ఇల్లాంటికాలంలో త్రికరణశుద్ధిగా చేసిందే మరీగొప్ప మేష్టరీ. మేష్టర్లంతా కలిసిఆందోళన చెయ్యాలి అంటారు. కలియడానికి త్రాణవుంటే కాదుటండీ? పైగా ప్రతీమేష్టరూ ఒక్కొక్క ప్రత్యేక విశేషంతోటి డకామొక్కీలకి ఆరి రగడుదేరిపోయిన వ్యక్తి కింద తయారై తన చేష్టలన్నీ శుద్ధన్యాయమని స్థాపింపగోవాలని యత్నించి నెగ్గుతూంటాడు ఎరగని. పిల్లల దగ్గర. ఇల్లాంటివ్యక్తులు ఏరెండూ కలవవు. ఆమాట కొస్తే మేష్టరికి అసలు వ్యక్తేలేదు. ఏవో రెండురాళ్లు వస్తున్నాయికదా, పోలుపూచీ గడిచిపోతోంది, ఏమన్నా అంటే ఆకాస్తగోడూ ఎక్కడచెడుతుందో, ఇకమరేమీ చేతగాదాయిరి అని అన్నిటికీ వడట్టి గొంతు కొత్తని వాడికి వ్యక్తిత్వం వుందనడం తిట్టడం అన్నమాట. అందుచేతనే కాబోలు, మేష్టరీ ఎంతకొండమీదిది అయినా, Findlay చెప్పినట్టు మేష్టరుచేస్తూన్న ఏతండ్రీ మళ్లీ తన కొడుకు మేష్టరుగా వుండాలని కోరడుట. అంటే, తాను జన్మబాల్యం స్వీకరించి తనజన్మలోచేసినత్యాగం తరతరాలవరకూ చాలుననేమో. అదేమోకాని, పదిపదిహేను ఏళ్లు మేష్టరీచేసిన ప్రతీవాళ్లనోటంటా ఇల్లాంటి మాటలు వింటూంటాం. "నాకు మొట్టమొదట్లో వెనక ఫలానా 'ఛాన్సు' వచ్చినప్పుడు ఫలానా వుద్యోగంలో చేరివుంటే, ఈపాటికి చాలా గొప్ప వుండా వాణ్ణి అయిపోదును. అందాకా ఎందుకు! అప్పుడే ఆ ఛాన్సులో చేరిన ఫలానావాడు ఇప్పుడు పెద్ద ఇనస్పెక్టరు కనపడితే పలకరించ నేనా పలకరించడు. కాని నాకిది రాసింది" అని మేష్టరీ వుద్యోగమో కాదో తెలియదు కాని వుద్యోగులంతా మేష్టరు సృజన. ఇంతమంది వుద్యోగుల్ని తయారుచేస్తున్నానుగదా, ఇహ సౌఖ్య ప్రధానమైన వుద్యోగం నేను అందుకోసం వదిలేస్తాను అనేవాడు మేష్టరు. ఇంకొకడు బాగుపడితే తనూ బాగుపడ్డట్టే అనుకోగలిగినవాడు మేష్టరు. అంటే మేష్టరికి భావనాశక్తి 'భూమికీ ఆకాశానికీ తాళం' అన్నంత వుండాలి. క్రియముక్క, హిందువులు వేదాంతులు. వారిలో మేష్టర్లు అగ్రస్థానం అలంకరించాలి. ట్రైనింగు అయేటప్పుడు అధమం సహాంకాలం, మేష్టరికి, ఆసైకాలజీతోపాటు వేదాంతబోధ సవిస్తరంగా చెయ్యాలి, అందులో ముఖ్యంగా కర్మవాదన. వెనకటి కాలంలో ఇండియాలో ఎక్కడపడితే అక్కడ కర్త, కర్మ, క్రియలు దొరికేవిట. కాని, క్రమేపీ, కర్తక్రియలని ఇతరులు హరించారు—కర్త కనిపించడు, క్రియ శూన్యం అయింది. హిందువులు కర్మ ఒక్కటే ధరించి, భరించారు. భరించాలి. అందుచేత, ఈయొక్క మేష్టర్లున్నారే, వీరు, భుక్తిఎల్లానూ ఇంతే అని ముక్తిమోక్షాలకోసం దేవుళ్లాడి పనిచెయ్యాలి.

"కాకన్ మానవు పూర్వజన్మకృతముల్
కర్మానుబంధంబులై
లేకన్ మాన పవెంతజాలిపడినన్
లేముల్ సిరుల్ రాఘవా!"




వేమూరు సీతారామశాస్త్రిగారు

బాలుండే, సభమున్ శుభంబెఱుఁగ, నీ పాదాంబుజాతమ్ములే
యాలంబమ్ముగ నమ్మినాఁడ, నా ప్రహ్లాదుం బలెన్ శ్రీధ్రువున్
బోలె న్నన్ను వినీతు నీతియుతుఁ బుణ్యు న్గణ్యునిం జేయుమా;
పాల న్ముంచిన నీట ముంచినను నీభారంబ సర్వేశ్వరా!

శా. వింటిన్ పెక్కుర బాలభక్తవరులన్ ప్రేమించి రక్షించి తం;
చుంటి న్నాపయి మాత్ర మేల కృపరాదో యంచు, నీమానసం
బంటం గొల్వఁగఁ జాల బాలకుఁడ నీ యంఘ్రిద్వయంబే నన్నె
గంటిన్ తెప్పగతి న్సతమ్ము మనుషంగాఁ జెల్లు సర్వేశ్వరా!

మ. హరుఁడంచున్ హరియంచు శక్తియను చల్లాయంచుఁ గ్రీస్తంచు పె
క్కురు నానావిధ నామరూపముల నీకున్ గల్పనల్ సేసి కొ
ల్తురు; నీరూపున కద్వితీయునకు నో లోకేశ! నీకీభిదల్
దొరకో నేమిటికో యెఱుంగ; నెటు నేర్తుం గొల్వ సర్వేశ్వరా!

మ. మఱపున్ దోలుమ, ప్రాలుమాలిక నశింపం జూడుమా, దౌష్ట్యమున్
గరువమ్మున్ సడలింపుమా, కృపణతా కాపట్యముల్ మాన్పుమా.
వెఱపున్ దీర్పుమ, కూర్పుమా వినయమున్, విద్యావివేకమ్ములన్
నెఱయం జేయుమ, పాయకుండుమ మది న్నిత్యమ్ము సర్వేశ్వరా!

శా. నన్నున్ నాసహపాఠి వర్గమును సంతానమ్ము మాడ్కిన్ మనున్
గన్నారం గనుమీ గురుప్రతతి నోకల్యాణసంధాయకా!
యన్నమ్మున్, వసనమ్ము, విద్యయును, దీర్ఘాయుష్య, మారోగ్యమున్
బున్నెంపుంగని నీదుభక్తి నిడి యోప్రొద్దున్ గటాక్షింపవే.

సంపూర్ణము

రాత్రి పదిఘంటలయినవి. శాంతమ్మ అట్లనే కూర్చుని యుండెను. సుమారు పన్రెండు ఘంట లయినను, కామరాజు రాకపోవుటను చూచి శాంతమ్మ నిద్దర నాపుకొనవలవిగాకుంటచే పట్టెమంచముపై పరుండి ఆనందమనుభవించెను. ఇంటి యందుండు ముసలియామె, వీధి గుమ్మమువద్ద కామరాజు రాక కెదురుచూచిచూచి అంతటి కెవ్వరు రాకుండుటచే నిద్దురపోయెను.

## 3

టవునుస్కూలుకు పోవుమార్గమునందు, ఆకుల వీధియని యొకవీథి యున్నది. ఇది బజారునకు సమీపమున ఉన్నది. ఇచట తమలపాకుల వ్యాపారము హెచ్చుగా నుండుటచే దీనికి ఆకులవీథి యని పేరువచ్చినది. ఈ వీధియందు తూరుపు ప్రక్క నొక చిన్న గడ్డియిల్లు ఉన్నది. ఆ యింటియందు పున్ని, వరహాలు అను యిరువురు స్త్రీలు కాపురముండిరి. పున్ని ఆ యింటి యరుగుమీద కిల్లీల దుఖాణము వేసికొని ఉదయము ఆరు ఘంటలనుండి రాత్రి తొమ్మిది, పదిఘంటల వరకు, బాటసారులకు కిల్లీలు వర్తకము చేయుచుండును. ఈమెకు పనియుండుసమయమున యుక్తవయస్కురాలగు వరహాలు దుఖాణముపై కూర్చుండును. ఈమె దుఖాణము నడపు సమయమున వ్యాపారము హెచ్చుగా ఉండును. సుమారు తొమ్మిది పది ఘంటలకు దుఖాణమును ముగించు వాడుక కలదు. నాటిదినమున తొమ్మిదిఘంటల సమయమునకే వ్యాపారము ముగించి యింటిలో పున్ని తనగృహకృత్యములను నెరవేర్చుకొనుచుండెను. వీథితలుపు మాత్రము మూయబడియుండెను. ఇంతలో వీథి తలుపుతట్టిన శబ్దమును విని "ఎవరుమీరు" అని లోపలనుండి ప్రశ్నించినయొక స్త్రీ కంఠధ్వని వినవచ్చెను. "ఎవరునూలేదు. నేనే" అని బయటతలుపువద్ద నిలువబడియున్న పురుషుడు మెల్లగా ననుచుండెను. కాని, ఆసమయమున ఆ వీథిలోనుండి యెవ్వరు పోవుచుండినదియు ఆయనకు తెలియదు. ఆయింటికి కొంచెము దూరములో ఉన్న సోడాదుఖాణమువద్ద సోడా త్రాగుచు నిలువబడియున్న వెంకట్రావు నీయన చూడలేదు. పకోడీలరామన్న యీతనినే చూచుచున్నాడనుసమాచార మీయన కెంతమాత్రమును తెలియదు. అయినను తన్నాసమయమున నెవరుచూచెదరో యను భీతిమాత్ర మీయన మనసును వీడిపోవుట లేదు. తలుపుతెరచి లోన నీతడు ప్రవేశించునరికి పెరటిలోని తలుపు మూసినశబ్దముమాత్రము వినవచ్చెను. ఈయన యింటిలోనికి ప్రవేశించెను. గూటియందొక దీపపుబుడ్డీ వెలుగుచుండెను. ఒక మూలనుండెడి నులకమంచముమీద నొక బొంతగుడ్డ పరచియుండెను. ఆ యింటియందు మరి యేమియును లేకుండెను. ఇంటియందు ప్రవేశించినతోడనే, పున్ని, "పంతులూ వచ్చినావా? నేను చెప్పినది తెచ్చితివా?" అని యడిగెను. "నీమాటకు ఆటంక ముండునా?" అని కామరాజు ప్రత్యుత్తరమిచ్చిన పిమ్మట, ఏదియో వారిరువురు మాటలాడుకొని, "వరహాలు! ఇటురమ్మ" అని వెనుక యింటియందున్న యువతినిపిలచి, [illegible]దుయింటి

యందుంచి, చేత నేదియో పట్టుకొని పున్న యథాప్రకారము తనగృహకృత్యములు నిర్వర్తించుకొన బోయెను.

ఇట్లు కొన్నిదినములు గతించినవి. శాంతమ్మకు దినదినమునను మనశ్శాంతి తక్కువగుచుండెను. ఏమి చేయుటకును ఆమెకు తెలియకుండెను. భార్యకు భర్తయొక్క నిరాదరణకంటె కఠినశిక్ష వేరొండులేదు. పాపమా శాంతమ్మ యెన్నిదినము లని యిట్లూరక యుండగలదు? కామరాజు ప్రవర్తన యందరకును వెల్లడి యాయెను. తనవద్దనుండు విద్యార్థులును ఆతని నడవడినిగూర్చి గుసగుస లాడుచుండిరి. తనయింటి సమీపమున ఉండువారలు శాంతమ్మను జూచి, యామె యవస్థకు విచారించుచు, ఆమెపై జూచి కొంత దయ గలిగి యుండినవారు. ఇట్టియెడ స్త్రీలకుండెడి యాయుధము మరణమని తోచగ ప్రక్కనున్న [illegible] ఎట్లయినను ప్రాణత్యాగము చేయుటకు శాంతమ్మ నిశ్చయించుకొనెను. అయినను ఆమె తొందరపాటుతో నేకార్యమును చేయునది కాదు. ఏకార్యమునకైనను దీర్ఘముగా ఆలోచించును. ఆనాటిదినము సంధ్యాకాలమున గుమ్మములనూడ్చి, అచటనే తనచేతియందున్న జెడి చీపురునట్లనే పట్టుకొని ఏదియో యాలోచించుకొనుచుండెను. ఆసమయమున రుక్మిణమ్మ పెరటిలో నుండివచ్చి "చెల్లీ! ఏకారణమున నట్లు నిలువబడియుంటివి?" అని యనునప్పటికి చేతియందున్న చీపురు క్రింద పడిపోయెను. ఆమె మాటలాడుట లేదు. కన్నీరు మున్నీరుగా వెలువడుచుండెను. ఆమె వెక్కి వెక్కి యేడ్చుచుండెను. రుక్మిణమ్మకు యన్నియు తెలియును. శాంతమ్మకన్న వయసున పెద్దది. వెంటనే యామె శాంతమ్మను తనచేతులలోనికి తీసుకొని యామె యరుగుమీదనే తనప్రక్కను కూర్చుండబెట్టుకొనెను. రుక్మిణమ్మకు యిదియంతయు తెలియక పోవుట లేదు. కాని, యెన్నివిచారము లయినను, యెన్ని మనోవికారము లయినను గంగాస్నానము చేసినతోడనే పాపములు పోవునట్లు, ధైర్యమూనిన తోడనే దూరముగ పోవును గదా! అట్లు కొంతసేపిరువురును మాటలాడుచు కూర్చునిరిమ్మట రాత్రియైనది. చీకటి యగుచున్నందున జేసి రుక్మిణమ్మ తనయింటికి పోయెను. వారిరువురు నేమి మాటలాడుకొనిరో? యేమి యాలోచించిరోగాని, రుక్మిణమ్మ వెళ్లునసమయము నందయు, శాంతమ్మ ధైర్యముగా నుండెను, ఏదో కార్యనిశ్చయమునకు వచ్చినదానివలె కన్పట్టుచుండెను.

ఆనాడు శనివారము; పౌర్ణమి. చంద్రుడు సంపూర్ణముగ ప్రకాశించుచుండెను. రాత్రియెనిమిది ఘంటలయినది. కామరాజు ఎప్పటియట్లు భోజనముచేసి వెల్లనియంగీ తొడుగుకొని, జరీయుత్తరీయమును వేసికొని, వీధిగుమ్మమువద్ద నిలువబడియుండెను. వరహాలుండు యింటికిపోవు ప్రయత్నముతోనే యుండెను. పూర్వము యెవ రేమియనుకొనెదరో యనుభయముచే రాత్రి యెవ్వరునూ చూడకుండెడుసమయమున వెడలుచుండెడువాడు. ఇప్పుడదంతయు పో

యినది. ఎవ రేమియనుకొనిన తన కేమియను నవసరకు వచ్చెను. ఆయన గుమ్మము దిగుట కుముందు శాంతమ్మ తెల్లని చీరె యొకటికట్టు కొని, రవికతొడుగుకొని, గనకుండెడి యాభర ణములన్నియుదాల్చి, తలదువ్వుకొని, వన్నె లాడివలె గుమ్మములోనికి వచ్చెను. అది చూచి కామరాజు ఆశ్చర్యముతో "ఇదియేమి యీ వేషము?" అని యడిగెను.

శాం—ఏమియు లేదు. [illegible] వేషము.

కామ—ఇట్లు బయలు దేరుటకు కారణమేమి?

శాం—బయలుదేరినాను, మరి—

కామ—ఎక్కడి కేమిటి?

శాం—ఎక్కడికో అక్కడికే.

కామ—నాన్‌సెన్సు. [illegible]

శాం—నాన్‌సెన్సు లేదు, గోనెసంచి లేదు. వాళ కమేమిటి? వాళకములేదు, గీళకములేదు.

ఇట్లు శాంతమ్మ తనతో యిదివర కెన్న డును మాట్లాడి యుండలేదు. ఎందుచే ఇట్లను చున్నదియు ఆయన గ్రహించలేక పోయెను.

గుమ్మములోఉన్న యాతడు చావిడిలో నకు వచ్చినాడు. అతనితో శాంతమ్మయు వచ్చినది. ఆమెను మంచిమాటలతో అడి గిచూడవలయునని "ఏమిటి, శాంతా! ఎచట కు బయలు దేరితివి. ఎవ్వరి యింటనైనను కార్యమగుచున్నదా యేమి?" అనియడిగెను.

శాం—మీకు లేనికార్యము నా కేమి?

కామ—అట్లయిన యెచటకు పోవుచుంటివి?

శాం—మీ రెక్కడకు?

కామ—నే నెక్కడకు వెళ్లెదనో, నీకు చెప్పి వెళ్లవలయునా యేమి?

శాం—చెప్ప నవసరములేదు. వెళ్లవచ్చును. మిమ్ములను నేను ఆటంకపరచితినా యే మి? ఆటంకపరచిన మానుదురా? వెళ్లుడు.

కామ—[illegible]

శాం—నేనునూ వెళ్లెదను.

కామ—ఎచ్చటకు?

శాం—మీ రెచ్చటకు?

కామ—సూత్రిమించి నాగమువలో పడ్డదే?

శాం—మించదూ? మించుతుందా, మరీ మిం చుతుంది.

ఈ [illegible] యు [illegible] యలేదు. శాంతమ్మ కన్నులు నిప్పులవలె యుండి ఒకొక్క చూపునకు ఎదురుగా ఉన్న వాళ్లింతా మాడిపోవునట్లున్నది. ఆడవాండ్లు చూడకుకూడదన్న సరిగ్గో, కాని చూచిన యెడల ఎవ్వరునూ నిలువబడగలరు? ఇంతవఱకును నిలువబడి యున్న కామరాజు కుర్చీమీద కూర్చు నెను. ఏమియు తోచలేదు. శాంతమ్మ మాత్రము బొటనవ్రేలుతో నేలపై వ్రాయుచు నిలువబడియుండెను.

కామ—అట్లయిన, నీవును వెళ్లెదనందువా?

శాం—వెళ్తానా, మరీ వెళ్తాను. నేనుమాత్రము మనిషిని కానా యేమి? మీకు అదియుం టే; నాకు—

ఈమాటలు శాంతమ్మ నోటినుండి వెలువడు సరికి కామరాజునకు శరీరస్మృతి తప్పెను. ఇక పైమాట యేమివచ్చునో యను భయ ముద్భవించెను. కాని కొంతవడికి తెలివి తెచ్చుకుని ధైర్యముగా—

కామ—అది అనుచున్నవు. ఏది యనరు?

శాం—ఎవరు? తెలియదనుకున్నావేమో?
ఆ బానిసముండ, ఇట్లనుచున్నది—

కామ—[illegible] ?

శాం—ఏమిటి? ఏమియులేదు. ఈ సంగతి
అంతయు తెలియదనుకొన్నారు. [illegible]
మగవారలయితే మరీ మాటలాడుతారా?
ఏమిటి నాలో తక్కువ అని అలా—

కామ—బాగుగనే ఉన్నది. ఇష్టము లేని
యెడల మీ యింటికి పొమ్ము.

[illegible]
[illegible]. ఏమిటి [illegible] నా
వాడు నన్ను మీ కిచ్చినా రనుకొనినా
రేమో?

ఇప్పటికి కామరాజు హాస్యమంతయు తక్కు-వాయెను. గదిలోనికి వెళ్లి కామరాజు [illegible] మును తీసి బట్టలగదిలోనుంచి మంచము మీద కూర్చుచునెను. [illegible] శాంతయు గదిలో ప్రవేశించెను.

శాం—అలాగున కూర్చున్నారేమి? వెళ్లరు.
పాపమది మీ రాకకై వేచియుండును.

కామ—వెళ్లను.

శాం—అయ్యో! వెళ్లకపోయిన యెట్లు? అది
యేడవదా?

ఏమియనుటకును కామరాజునకు మాటలు రాలేదు. మనసులోన ఏదియో నూతన భావవికార ముద్భవించెను.

కామ—మరి వెళ్లను.

శాం—ఆ! వెళ్లరూ? ఈవేళ మీ రేటి?

కామ—నిజము. వెళ్లను చూడు.

శాం—మగవారిని నమ్మమనినా రేమి? ఇన్ని
దినములనుండి యెందులకు వెళ్లితిరి? అది
[illegible] నాకన్న అందకత్తె యనియనా? వండి
వడ్డించుననియనా? ఏమి చూచి వెళ్లినారు?

కామ—ఏమియో? పొరపాటయినది.

ఇట్లొకరితో నొకరు సంభాషించుకొని, కొంతసేపునకు శాంతమ్మ కామరాజ భుజముపై తలనిడి, చేయి యాయనమీదవైచి, [illegible]. [illegible] కామరాజునకు [illegible] కన్నులనుండియు నీరు కారుచుండెను. ఇదివఱకు కారణము చేసిన పాపమంతయు ఈ నీటిరూపమున బోవుచుండెను. ఇట్లు కొన్ని దినములు గడచిన పిమ్మట చూడ వారియింట మోహనరావను చిన్నవాడొకడు తనవచ్చియు రాని ముద్దుమాటలతో, తన తల్లిదండ్రులగు శాంతమ్మ, కామరాజులకు ఆనందము కలిగించుచుండెను.

ఆట యాగ్రామమున నుండు వరహాలు తన కాగ్రామమున వ్యాపారము మునుపటివలెనే జరుగకుండుటచే యా గ్రామమువిడచి తాతా నగరము వెడలిపోయెను.

---



# కాకతాళీయము

చింతలపాటి వెంకట శ్రీరాములు గారు, బి. ఏ., యల్. టి.

భీమేశ్వరరావుగారు ప్రిన్సిపల్ కోర్టు మునసబు పెద్దాపురంలో. కొంచెము తొందరపడేస్వభావము గలవాడు. కోర్టులోనైనా అంతే! చిరాకుఎక్కువ ప్లీడర్లనే విదిలించివేస్తాడు. గుమాస్తాలకు జవానులకు హడలు. ఏమిమాట్లాడితే ఏమనేవారో? లంచపంచముల విషయంలో చీటికి మాటికి ఏస్వల్పమునకైనా కక్కుర్తిపడేవాడుగాడు. కాని తానొక పెద్దఅధికారినని, తక్కినవారు సామాన్యులని కైపు బాగా తలకెక్కియున్నది.

కామేశ్వరమ్మగారు మహాదొడ్డ యిల్లాలు. ఆమె పెనిమిటి తొందరకు, ఆమె నిదానమునకు సరిపోయింది. భర్తయొక్క స్వభావమును బాగా గుర్తెరిగిందిగనుక బహునేర్పుతో ఆయనమనస్సును నచ్చినట్లు మాట్లాడుచు, పంతులుగారు సంతోషముగా నున్నప్పుడు మెత్త మెత్తగా హెచ్చరించుచు, యింటిపనులు చక్కబెట్టుచుండెడిది. పెట్టుపోతలవిషయంలో ఆమెను చెప్పి వేరొకరిని చెప్పవలెను. గ్రామంలో ఎక్కడ పట్టెడన్నము దొరక్కపోయినా మునసబుగారింట్లోమాత్రము అన్నాతురుడై వచ్చినవానిని, 'భోజనాలైనాయి నీకోసమని వండివార్చామనుకున్నావా?' అని కేకలువేసి 'దుంగముక్కలా గున్నావు' పనిచేసుకోరాదా; యని వెళ్ళగొట్టడమన్నమాట లేదు. పనిపాటలవాళ్లు 'ఆ అమ్మకు చెయ్యెత్తి దణ్ణము పెట్టవచ్చు. ప్రొద్దున్నే లేచి ఆతల్లిని చూస్తే పాపాలన్నీ పోతా' యనుకొంటారు. ఇరుగు పొరుగువారి కష్టసుఖాలు తనవిగా భావించుకునేవి కామేశ్వరమ్మగారు. పెద్దవుద్యోగస్థుని పెళ్లాన్నిగదా యని ఆమె కొంతమాత్రము గర్వముండేది గాదు. పచ్చని శరీరముమీద బంగారము కానరాకుండా పట్టెడ పసుపు కుంకుమలో పూచిన తంగేడులాగుండు ఆ పెద్దముత్తైదువు ఎవరైన పేరంటానికి పిలవనివాళ్ళది పాపం. అంత మేలొనర్చిన అమ్మకు కడుపుఫలించకుండావుంటుందా! కామేశ్వరమ్మగారికి ముగ్గురుకుమాళ్లు; ఇద్దరు కుమార్తెలు పెద్దవాడు బ్రహ్మానందమునకు పద్ధెనిమిదిసంవత్సరములు వయస్సు; బి. యే. క్లాసు చదువుతున్నాడు. అప్పుడే అనేక సంబంధాలు వస్తున్నాయి, పెద్దపెద్ద కట్నాలువిల్లమారిన లాంఛనాలు యిస్తామంటూ. భీమేశ్వరరావుగారు "మాపిల్లవాడేమి పెద్దమనిషిఅవుతాడా; యిప్పుడే ఏం తొందర. చదువు పూర్తిగాందే వివాహం మాట తల పెట్టం" అంటూ బెట్టుచేసి ఏనాలుగైదు వేలైన కనీసం లాగవలెనని ఊటలూరాడు కాని, ఒక్కసుగుణం వుంది భీమేశ్వర్రావుగారి దగ్గర. ఎవరిమీద ఎంత చిరాకుపడ్డా భార్యమాటంటే మహాచెడ్డకరి. కామేశ్వరమ్మగారు సామాన్యగృహస్థులయింటిఆడపడుచైనను పెళ్లినాటికి భీమన్నగారి సంసారంలోను పట్టులేదు. ఈ సిరిసంపత్తంతా ఆమెనుదుటి రేఖ.

సుబ్బారావుగారు కామేశ్వరమ్మగారికిపినతండ్రి కుమారుడు. ఆయన పెద్దాపురం హైస్కూలులో ఉపాధ్యాయులుగానున్నారు. నెలకొకవందరూపాయలిస్తారు. కాని ఆయనోసబ్‌రిజస్ట్రారా? ఓ, ఓక్కిలా? వకీలా! ఓ రివిన్యూ యినస్పెక్టరా? కనీసం 'ఓ' అంటే 'ఢం'రాని తాలూకాబోర్డు హెడ్ క్లార్కు అయినాకాడు. ఎన్నాళ్లు వుద్యోగం చేస్తే ఏం? వేలకట్నాలు పెట్టి అల్లుణ్ణి తెచ్చుకునే తాహతు ఎక్కణ్ణించి వస్తుంది.

సరస్వతి చక్కనిచుక్క. ముక్కు, మొగము తీర్చినట్లుంటాయి; జనముద్దైన బిడ్డ; పాలుగారు బాల ప్రాయం వదలి అప్పుడప్పుడే పెళ్లి యీడు వస్తున్నది. రామాయణమహాభారతాలు అనర్గళంగా చదివి అర్థం చెపుతుంది, తల్లికి నాయనమ్మకు. బ్రహ్మానందమునకు యీడుజోడు అని ఉన్నది సరస్వతి తండ్రికి. కామేశ్వరమ్మగారు కులశీలములు చూచుకుని కుర్రవాడు కుర్రదీ

యింత సుఖంగా పదికాలాలపాటు కాపురం చెయ్యడం కోరుకునే యిల్లాలుగనుక డబ్బు కక్కుర్తికి దౌర్భాగ్యపు సంబంధాలను ఒప్పుకునేదిగాదు. అదిగాక సుబ్బారావుగారుకూడా వెయ్యినూట పదహార్లు యిస్తామంటున్నారు. ఎక్కడికి దీనికి అంతు?

బ్రహ్మానందం వివాహం పదిరోజుల్లో వచ్చింది. పెళ్లికూతురి నగలకింకా పేరుపెట్టలేదు. 'సరస్వతికి కూడా తనలాంటి పూర్వోత్తరపు గండమూ వెంటేనా' అన్నది కామేశ్వరమ్మగారు దైన్యమతితో. "ఏంచేసు! ముప్పైకాసులు పెట్టి డాలరుగొలుసు, పదికాసులకు నాలుగు రకాల గాజులజతలు ముందు చేయింతాం; రేపు సంతగూడాను; మరాబు వూళ్లో కొస్తాడు. మరాబును పిలిపించవోయి" అన్నారు భీమేశ్వరరావుగారు జవానుతో!

సాయంకాలము మునసబుగారు కోర్టునుంచి అయిదుగంటలకు యింటికివచ్చి వసారాలో ఒక పడకకుర్చీలో జేరగిలబడ్డారు. వారి సుఖవిలక్షణం మాని ఒకన్ను మీద దూరంగా తప్పుకుంటున్నారు. ఆ చివరిని ఎదురుగుండా గోడ్తోత్తుకు చినిగిపోయిన పాతగుడ్డలు కట్టుకుని ఒక బీదబ్రాహ్మణుడు చిన్న గడ్డమూట దగ్గర పెట్టుకుని కూర్చొనున్నాడు.

భీ—ఎవరయ్యా నీవు? ఎందుకక్కడ కూర్చున్నావు.

బ్రా—బాబూ, మాది ఒంగోలు తాలూకా అండి. సంసారం జరక్క సంచారార్థం వచ్చాను తమబోంటి ప్రభువుల దర్శనం చేయడానికి. ఈరాత్రి పట్టెడు ప్రసాదం పెట్టించమని కోరాను. అమ్మగారు ఉండమని సెలవిచ్చారు.

భీ—ఊఁ.

ఇంతలో జవాను మరాబును తీసుకుని వచ్చాడు. మరాబు నలభైకాసులు దొంతులుగా బల్లమీదపెట్టి తాను నోట్లు లెక్క చూచుకుంటున్నాడు. భీమేశ్వరరావుగారు పరధ్యానంగా ఎటో చూస్తున్నారు.

మురళికి మూడేళ్లునిండాయి, నాలుగోయేడు వస్తోంది. కడసారివాడు అవడంచేత గారాబం ఎక్కువ. మురళి యిప్పుడు బాబయ్యగారికోసం పరుగెత్తుకుని వచ్చాడు. వారు దగ్గరకుతీసుకోలేదని అప్పుడే వెళ్లిపోయాడు లోపలికి తల్లిదగ్గరకు.

మునసబుగారు మెల్లగా లెఖ్ఖపెట్టడం ప్రారంభించారు కాసుల్ని. అన్నిలెఖ్ఖపెట్టి అట్టే మరాబుకేసి చూచారు. మరాబు వాటినందుకుని తానులెఖ్ఖపెట్టి చూసాడు. ముప్పైగూడు మాత్రమే కనబడుతాయి కాసులు.

మరాబు—(తెల్లబోయి) చిత్తం నలభైకాసు లుంచానండీ, బల్లమీద!

మున—అయితే ఏమవుతాయి? ఇంతలో యిక్కడికి ఎవరొచ్చారు? దాసీదాన్ని సాకన్లను ఎవర్నీ అవతలకు వెళ్లనీయవద్దు; ఇల్లు తాళంవేయించండి. అందర్నీ సోదా చూడండి; ఇంత అగడమా యింటిలో!

బ్రాహ్మడికి ఏమీతోచలేదు. హా! పరమేశ్వరా అని గట్టిగట్టిగ గుక్కపెట్టుకొని మొలలోవున్న ఏడుకాసులు విప్పి పంతులుగారి బల్లమీద పెట్టాడు.

భీమేశ్వరరావుగారికి ఎక్కడలేని ఒళ్లుమంట, పట్టరాని కోపంవచ్చింది. (పండ్లు పటపటకొరుకుచూ) "ఎక్కడలేని దౌర్భాగ్యలక్ష్మి యింటికి చేరుస్తుంది" అని భార్యమీద విసుక్కొని, "దక్కించుకోలేక వెళ్లగక్కావు. బ్రాహ్మడవు గాబట్టి బ్రతికిపోయినావు. నీ మొగం చూడకూడదు. లేకున్న నిన్ను పోలీసుల కప్పగించి కైదులో పెట్టింతును. పదపద! యీ వేళకి తగ్గు" అని బంట్రోతుచేత బైటికి సాగనంపించాడు.

ఈ దారుణమును చూడలేక సూర్యభగవానుడప్పటికి అస్తమించాడు. అంతలో బ్రాహ్మణుని హృదయమునావరించిన దుఃఖమువలె ఆకసమున మేఘము లలముకొని చీకటి కన్ను బొడుచుకున్నను కానరాదయ్యెను. వాని కన్నులనుండి జాలుకొను వేడి నీటిముక్కలవలె, చిటపట చినుకులు పడసాగెను. ఆశాకుసుమవిరహితమగువాని శూన్యహృదయమువలె ఆకసమునందొకనక్షత్రమైనను గానరాదయ్యె. తన యభాగ్యమును నిందించుకొనుచు బ్రాహ్మణు డాచీకటి రాత్రి పెద్దాపురంసందులబడి తిరుగుచూ తనను పట్టుకొనుట కెక్కడనుండి వచ్చుచుండిరో యని వెనుకకు తిరిగి

చూచుచు తుదకోక యింటివీథిఅరుగుమీద చదికిల బడి పొంగిపొరలివచ్చు దుఃఖము నాపుకొనలేక పెండ్లాము పిల్లలను తలచుకొని ఉసురుసురునుచు వేడి నిట్టూర్పులు విడుచుచు తీవ్రమగు హృదయవేదనకు పాలగుచుండెను.

లోపల నెక్కడో పనిచేసుకొన్న కామేశ్వరమ్మగారికి యీగొడవ ఏమియు తెలియదు. వంటమనిషి వంటైనదని చెప్పటతోడనే పెనిమిటికి కాళ్లు గడుక్కోడానికి నీళ్లిచ్చి బ్రాహ్మణ్ని గూడా లేచి ముడి గట్టుకోమనడానికి సావిట్లో కొచ్చేసరికి పంతులుగారు ధుమధుమలాడుతూ, పడదిట్టేస్తున్నారు బ్రాహ్మణ్ని 'ఇందుకనే కోట్లకు పుట్టగతులుండవ'ని. ఇంతలో భార్యనుజూచి "అడ్డమైనవాళ్ళను కొంపకు చేరుస్తావు. ఆ బ్రాహ్మణ్ని తిండితినుమన్నావుట. వానిపిండాకూడు పిండాలకెయ్య; ఆ దౌర్భాగ్యుడు బల్లమీదకాసులుపెట్టి మాట్లాడుకుంటూ కూర్చుంటే ఏడుకాసులు తీశాడు. కదిలినట్టు లేదు; మెదిలినట్టూ లేదు. వాడు కంట్లోని నుపాపలను తీసే వాడిలాగున్నాడు. బ్రాహ్మణుడని నెపనను చీవాట్లతో విడిచిపెట్టాను. అన్నదానాలు, అతిథిపూజలు అంటూ దొంగముండాకొడుకుల నింటికి చేర్చకేం." అని ప్రారంభించాడు శ్రీ మేశ్వరరావుగారు. "పరి మురళి గుప్పెడు కాసులట్టుకొచ్చాను లోపలికి. అవెక్కడివి" అంటూ కామేశ్వరమ్మగారు గదిలో పరుపుక్రిందనుండి కాసులు తీసి లెక్కపెట్టి (పెనిమిటితో) "పిల్లవాడు ఏడుకాసులు యింతకుముందే పట్టుకొచ్చాడు. మీ పరధ్యాన్నముతో ఈ దిక్కుమాలిన తొందరగూడాను" అని కసుకట బడ్డది.

"కాసులు పోయినాయని నే చెప్పకు అట్టహాసం చేశానో అప్పుడు ఆ బ్రాహ్మడే గొడ్డలోముల్లె విప్పి తెచ్చియిచ్చాడే" అంటాడు శ్రీ మేశ్వరరావుగారు నిర్ఘాంతపోయి.

"ఎంతప్రమాదం ఎంతప్రమాదం. ఏపాపం ఘోర క్కపట్టెడన్న మాశించిన బడుగుబాపని పడదిట్టి పైబడి కొట్టబోయి చీకట్లో చినుకుల్లో యిల్లువెడలనడిచితిరిగా! ఆ మహానుభావుని హృదయం ఎంత క్షోభపడుతూన్నదో! పగలెవ్వరూ పిడికెడు మెతుకులు పెట్టలేదన్నాడు కూడాను. ఈ అర్ధరాత్రి ఎటుపోయెనో? శోషవచ్చి ఎక్కడనైనా పడిపోయెనేమో కదా! ఈ బ్రహ్మహత్యా పాతకమును గూడ ఒడిగట్టవలయును గాబోలు" నని కామేశ్వరమ్మగారు పరితాప పడజొచ్చెను.

మునసబుగారి కేవిూ పాలు పోలేదు. వెంటనే యిద్దరు బంట్రోతులను లాంతరు పుచ్చుకొని ఆ బ్రాహ్మడు పోయినజాడ తెలుసుకొని వానిని దీసుకుని రమ్మని పంపెను. వారు వీధులం దిరిగి ఒకసందు ప్రవేశించు సరికి ఒక యరుగుపై రామనామస్మరణ చేయుచు, మధ్య మధ్య నేదియో జ్ఞాపకము రాగా నూర్చుచు, పడుచూ లేచుచూ, సత్రివానికై దిరుగాడుచున్న పేదబాపని జూచి "యీ వేళటికి అదృష్టవంతుల మే; తిరగలేక చచ్చ మాసింది. ఇదుగో బాపనాయన; యిక్కడ చిక్కాడు రా! బాబూ అప్పుడే యింతదూరం ఎప్పుడువచ్చావయ్యా; నీవు మా అసాధ్యుడులా ఉన్నావు!" అంటూ జవానులు దగ్గరకు వస్తూ ఉంటే "తండ్రీ! రామచంద్రప్రభూ! యింకా ఏమి అనుమానంగా నున్నదో అప్పుడే ఏమైంది. ఇంతటితో వదిలేశావా నన్ను! దరిద్రుడు ఒడిగడితే వడగండ్లు వానకురిసిందట. ఇంతకు, దరిద్రంతో తట్టుముట్టాడుతూ లేమిడి సంసారంగదా అని దేశాలు గాని దేశాలకు అడుక్కొనవచ్చి, అగచాట్ల పాలై తిని గా, రామయ్యతండ్రీ! నీదయ యింతగా వచ్చిందేం. ఈ దిక్కుమాలిన పక్షిమీద! ఏమి! నాయనా యిది; ఏ నాటి శత్రుత్వమో" అని విలపించుచు బంట్రోతుల వెనువెనుకల అడుగులు తడబడుచూ నడుచుచుండెను.

వీధిలోకి రాగానే శ్రీ మేశ్వరరావుగారు "ఏమయ్యా, నీవు తమాషా బ్రాహ్మడులా ఉన్నావు. కాసులు పోయినా యంటే గప్‌చిప్‌గా కట్టుపంచ ముడి విప్పి మారుమాట్లాడకుండా బల్లమీద పెట్టి తోవను బట్టావు?"

ఇంతలో కామేశ్వరమ్మగారు "ఎంత ప్రమాదం; శాస్త్రుల్లుగారు! ఎంత పొరపాటుపని జరిగింది. కుర్రవాడు గుప్పెడూ దీసుకుని గుసగుసలోపలి గుమ్మం లోకి వస్తూ ఉంటే, కుర్చీలో కూర్చున్నవారు కునుకుతున్నారు గాబోలు! అయినా, అంత తొందరేమమ్మా, మనుష్యులకు!!

"కాసులు పోయినాయని బాబుగారుకస్సుబుస్సలాడి అల్లరజేసి, పోదామాండవలెనని చుఱుచుఱుచూచేటప్పటికి, ఏలాగూ మెలబట్టి తెప్పిస్తారు. మానుషం దక్కదు. అందులో తక్కువ ఎన్నో నాబొడ్డున వున్నవన్నే! ఏంచెపితే ఏమి నమ్ముతారు; పాతగుడ్డలు గట్టుకుని పట్టెడన్నముకు పరులపంచల బడియున్నవాణ్ణి; పైపెచ్చు అమానుషంగూడా అవుతుంది. నేనేతీసికెళ్లి యిస్తే కొంత కనికరిస్తారని అల్లా చేశాను. వెన్నెలను వేగిపోయేదేశాలు; నిప్పన్నరపు కాపురం; పేదరికమునకు పిల్లలెక్కువన్నట్టు ఏదో యీశ్వరుడు నలుగురుపిల్లలనుగూడా యిచ్చాడు, కూనాగుడ్డూ. సుభిక్షమైన దేశం; ఏగోనలుగురు సంపన్నగృహస్థుల దర్శనంజేసి ఒకరెండు నెల్లపాటు సంచారంచేస్తే ఏమో! ప్రాప్తం" అని యిటునై పులకువచ్చి మనవాళ్లని చూస్తుంటే యీశ్వరుడు వారికి బుద్ధిపుట్టించినంత తృణమో కణమో, కటాక్షిస్తూవచ్చారు. ఎప్పటివప్పుడేమణి ఆర్డరు చేద్దామంటే ఆసమనిషి వట్టి అరబంధురాలు; పిల్లలు పసివాళ్లు. అందుకని ఎప్పటికప్పుడు కాసులుమార్చి మొలలో గట్టుకుంటూను. ఇంతకూ నేను లేచినవేళ మంచిది. "అమ్మా, అబ్బాయిగారు వాటినెక్కడనైనా పారవేసినట్టాయనా, అవి కనబడకపోతే అప్పుడేమనేవాళ్లు? ఎంతపాపం చేసుకుంటేనో కాని కూటికి గుడ్డకు దూరముగాము మాతల్లీ!"

"తొందరపడ్డాను సుమండీ శాస్త్రులుగారూ, అదిచూడండి- కాకతాళీయంగా. అన్నే సరీగ్గా మీాదగ్గిరుండడం."

"సరిలెండి; ఈవాళటికి అదృష్టవంతులము. అంతటితో పోనిచ్చారు! ఎంత అప్రతిష్ఠ! ఎంత అపఖ్యాతి! మాయతొందర! మంచిపెద్దా లే! బాగానె వుందిగాని, మడిగట్టుకోండి పొద్దుపోయింది. అబ్బాయి పెళ్లిదాకా ఆగుతారులెండి శాస్త్రులుగారు!!




# మల్లికా పరిణయము

[వెనుకటిసంచికలోని చిత్రమునుజూచి వ్రాసినపద్యము]

పూడిపెద్ది వెంకట రమణయ్యగారు

మల్లికాకాంత యింటిగుమ్మమున నిల్చి
మెల్లమెల్లఁగ దూరుపు మేడపెడలు
చందములప్రోవు పున్నమ చందమామ
జాడఁ దిలకించి పులకించె సంతసించి
ప్రణయరాగంబు హృదయానఁ బట్టలేక
వానికరములలోఁ జొచ్చి మేను మఱచి
కౌఁగలింతను మెల్లఁగఁ గరఁగిపోయె

* * * *

వేదనాదంబుతోఁ దేఁటి విప్రుఁడగిరి
చిన్నిజిలుగుల రెక్కల చేతులెత్తి
మేలిదీనన లిడెఁ నూత్న మిథునమునకు

* * * *

ప్రణయదేవత పొంగి యంబరతలాన
వన్నెవన్నెల ముగ్గు లెన్నెన్నొ పెట్టె.



# రాజేశ్వరి

టేకి సూర్యప్రకాశరావు గారు

రాత్రి ఏడుగంట లయినది. మాయింటిలో రాజ్యము రాజేశ్వరియుఁ దప్ప నెవరును లేరు. దక్షిణపువైపు వసారాలోఁ గూరుచుండి లాంతరు దగ్గరబెట్టుకొని ఒక్కటే ధ్యానముతో రాజ్యము భాగవతములోని దశమస్కంధము చదువుచున్నది. నా రాజ్యమునకు ఆపోతరాజుగారు వ్రాసిన కృష్ణలీలలు ఎన్నిసారులు చదివినను తృప్తియే లేదు.

"శా. అమ్మా! మన్నుదినంగ నేశిశువనో,
యాకొంటినో వెఱ్ఱినో
నమ్మం జూడకు వీరిమాటలు మదీ
సన్నీవు కొట్టంగఁ దా
నిమ్మార్గంబు ఘటించి చెప్పెదరు కా
దేని న్మదీయాస్యగం
ధమ్మాఘ్రాణము సేసి."

అన్నపద్యము భాగవతము తీసినప్పుడెల్లను చదివి సంతోషముతోను, జాలితోను, కన్నుల నీరు పెట్టుకొనుచుండును. అట్లే నేడును కృష్ణలీలలే చదువుచున్నది. ఇఁక రాజేశ్వరి ఏమిచేయుచున్నదో మనవిచేసెదను. రాజేశ్వరికి నాల్గుసంవత్సరములు వచ్చే జ్యేష్ఠ మాసమునకు వెళ్లి పోవును.

తల్లి భాగవతము తీసికొని దీపమువద్ద కూర్చుండగానే తాను వెస్టుఎండుకంపెనీ వారి గడియారముల క్యాటలాగు తీసికొనివచ్చును. తల్లి భాగవతము లోలోపల చదువుకొనుచు కన్నుల నీరుగ్రుక్కుకొనుచు పరవశురా లగుచుండును. ఇఁక మారాజేశ్వరి ఇట్లు గట్టిగా జదువ నారంభించును. "మాకోనేటితాతగారు ఎప్పుడు వస్తారో" మిఠాయి పట్టుకు వస్తారో, రారో" అని చదువుచు తల్లి చదువుచున్న భాగవతమును క్రిందకు దింపి పట్టుకొని 'అమ్మా! తాతగారునాకు మిఠాయి తెస్తారా తేరా చెప్పవూ' అని మారాము చేయుచుండును.



'అమ్మా! తాతగారు నాకు మిఠాయి తెస్తారా తేరా చెప్పవూ'

గ్రంథపఠనమునకు కొంచెము అంతరాయము కలిగెనని దుఃఖపడునుగాని పిల్లపై విసుగుకొనక, 'ఉండుతల్లీ! అడుగో, రారా!' అబ్బీ! మాఅమ్మాయిని బుట్టలోవేసికొని పోరా! అని బూచివానిని పిలుచుచుండును. రాజేశ్వరి తాను పట్టుకున్న భాగవతమును వదలిపెట్టి ఏడువ నారంభించును. దానితో రాజ్యము పుస్తకమును సాంతముగానే అవలపెట్టి రాజేశ్వరిని ఒడిలోనికి దీసికొని తలను వ్రేళ్లకొనలతో దువ్వి అమ్మా! అదుగో! తాతగారు క్రొత్త పరికిణి తెస్తున్నారు. ఏడువకు తల్లీ!, అని సముదాయించగా రాజేశ్వరి కొంచెము ఏడుపు మాని, కొంచెము మూతి ముడుచుకొని కూరుచుండును. తిరిగి రాజ్యము భాగవతము పత్రములు త్రిప్పుచుండును. రాజేశ్వరి, తల్లిని ఎన్నడును పల్కరించుచునే యుండును. ఒక్కనిముసమైనను మిన్నకుండ నుండలేదు.

“అమ్మా! బాప్పిరాజు మామయ్య నన్నే కొరుకుతానన్నాడు. నన్నెందుకు మున్నెట్టకోవాలెం” అని కొంతసేపు సంగీతము తీయుచుండును.

“అమ్మా! నాన్నగారు నీకే మప్పుతారు చెప్పవా!”

“అమ్మా! అక్కయ్యపాట నాకు చెప్పవూ!” అని తల్లి చీరచెరగు పట్టుకొని లాగ నారంభించును. ఇట్టి ప్రశ్నలు లక్షలు. ఆతల్లికి ఆకూతురునకు గనుక సరిపోయినది. ఆసాయంకాలము వారివెనుక కొంచెము దూరముగా నిలుచుండి తల్లీబిడ్డలభాగవతమును జూచుచు నేను ఆనందించుచుంటిని.

ఇంతవరకును పట్టపగలువలె ప్రకాశించుచున్న వెన్నెల, మబ్బుగ్రమ్ముటచే మసకమసకగా గన్పట్టెను. తలయెత్తి ఆకసమువంక జూచితిని.

“రాజేశ్వరి ఏమిచేసినదో తెలియునా? చటుక్కున దీప మార్పినది. అబ్బబ్బబ్బా! ఎక్కడిపిల్లమ్మా” అని తల్లి కొంచెము పండ్లు బిగించునుగాని తానుచ్చరించుమాటలు ప్రేమపూరితములై వెలువడుచుండును. బిడ్డవిషయమై తనముఖముపై నెన్నడును కోపరక్తమే ఆరోహించనీయదు. రాజ్యము తిరిగి దీపము వెలిగించినది.

ఆనందడోలికలలో ఊగుచున్నవానివలె నేనును లోనప్రవేశించితిని. నన్ను జూచి రాజేశ్వరి నాయొద్దకు పరుగెత్తుకొని వచ్చినది.

మా యింటిముందర కొబ్బరిచెట్ల క్రింద మంచముపై విశ్రమించితిని. ఎందులకు? అది నా న్యాయస్థానపీఠము. కొబ్బరిచెట్లు మాకు నేకుడై చల్లగా విసరుచుండును. చంద్రకాంతిలోనే కేసులు తీర్పు చెప్పుచుందును. ఫిర్యాది నాముద్దులబిడ్డ రాజేశ్వరి. ప్రతివాది రాజ్యము.

“నాన్నగారూ! మధ్యాహ్నం తొమ్మిది గంటలకు అమ్మ రాజమ్మపిన్నిగారింటికి ముగ్గుకు వెళ్లింది. నాకు బువ్వపెట్టలేదండి.” అని ఒక ఫిర్యాదు.

“నాన్నగారూ! ఇందాక పదహారుపాయల మల్లెపువ్వులు కొనమంటే అమ్మ కొన్నది కాదు. నాన్నగారూ! మీరు అమ్మను

కోపపడండీ" అని మఱియొక ఫిర్యాదు. అన్నిటికంటెను గొప్పనేరమొకటి యున్నది.

"నాన్నగారూ! అదిగో! చూశారా!" అని రాజేశ్వరి పరుగుపరుగునబోయి కడుపు చెక్కలగునట్లు నవ్వుచున్న రాజ్యమును ఒక్క దెబ్బవేసి తిరిగి నాదగ్గఱకు పరుగెత్తుకొనివచ్చెను. "చూడండీ! నాన్నగారూ! నాతో నవ్వ వద్దంటే ఎందుకు నవ్వాలేమిటి? అని రాజేశ్వరి సంగీతము దీయ నారంభించెను. నాతీర్పు లన్నిటిని ఫిర్యాదు తీరుపుననే చెప్పుచుండెడి వాడను. నాతీర్పులు రాజ్యమునకు కేవలము అసంతుష్టికరముగానే యుండెడివి. అట్లు చేయ కపోతినా రాజేశ్వరి ఏడుపునకు అల్లరికి మితి యుండదు. కాబట్టి బిడ్డకొఱకు ధర్మమునదలి పెట్టి తప్పుడు తీర్పులు చెప్పవలసి వచ్చుచుండె డిది.

నిన్నటి ప్రకాశించు నెన్నెల. నల్లని మబ్బు లలో చంద్రుడు దాగిలిమూతలాడుచున్నాడు.

నేను:—అమ్మా! రాజేశ్వరీ! ఆ తెల్లమబ్బులు ఎల్లా ఉన్నాయో చెప్పు.

రాజే:—చెప్పనా! మా తాతయ్య గెడ్డ మువలె నున్నాయ్—

నిజము; నామామగారికి గెడ్డము గలదు.

మా రాజేశ్వరి ముఖచంద్రుడు, నామామ గారి గెడ్డము మబ్బులలో దాగిలిమూత లాడుచుండును గనుక మాబిడ్డకు సరియయిన పోలికయే తోచినది.

"మీరు కవులు గనుక ఇల్లాంటివన్నీ తోస్తుంటాయి మీకు" అని రాజ్యము చిఱు నవ్వుతో ననెను.

వీథిలో కేకలు వినవచ్చెను. మా పెంపుడు కుక్క మొఱుగ నారంభించెను. "రాజారావు పంతులుగారు ఇంట్లో ఉన్నారా?" అని ముసలి స్వరము వినవచ్చినది.

రాజ్యముపోయి వీథితలుపు తెఱచి వచ్చి నది. రాజ్యము ఆవచ్చినవారికి కాళ్లు కడుగు కొనుటకై నీళ్లబిందె చప్పుడుచేయుచుండెను. నేను మంచముమీదనుండి లేచి నిలువబడితిని. మాపిల్ల చప్పటలు చఱచుచు, చిందులుత్రొ క్కుచు "మాకోనేటి తాతగారు వచ్చారు. మాకోనేటితాతగారు వచ్చారు" అని కేకలు వేయుచు తాతగారిచేతిలోని మిఠాయిపొట్లము నందికొని తల్లి వద్దకు పాఱిపోయెను.

ఆవచ్చినవారు కోనేటి తాతగారు కాదు, అది రాజేశ్వరి పెట్టిన పేరు. ఆయన కోనసీమ తాతగారు. ఆయనను మేము అట్లు పిలుచు చుందుము. వారిది అమలాపురం తాలూకా యని మా నాన్నగారు చెప్పుచుండెడివారు. మానాన్నగారికని, వీరికిని ప్రాణస్నేహము. మా పట్టణములో వారికి వ్యవహారము కలదు. ఆ కారణమున అప్పుడప్పుడు మా యింటికే వచ్చుచుందురు. మాతండ్రిగారు జీవించియున్న ప్పుడు మేము చిన్నపిల్లలమై యుండగా వీరిని కోనసీమ తాతగారని పిలిచెడివారము. అం దుచే, నాకును, నాభార్యకును, మాబంధువు లందరికిని కోనసీమ తాతగారయినారు. రాజే శ్వరికి మాత్రము కోనేటి తాతగారయినారు.

కుశలప్రశ్నలు చేసికొనుచు భోజనమునకు లేచితిమి. కోనసీమ తాతగారు చాల మంచివారు. వారి ముఖముపై నెప్పుడును చిఱునవ్వు సుందరనాట్యము చేయుచుండును.

రాజ్యము మిన్నకుండెను నాకు జడిసి. వాస్తవముగా స్త్రీకి ఆమాత్రము ధైర్య మెక్కడనుండును? అందులో బొత్తిగా పిటికెడ నా రాజ్యము. ఇది నిమిషమును లయినది.



"మా కోనేటితాతగారు వచ్చారు ........"



"మిఠాయిపొట్లము నెత్తికొని..............."

మా అందరికంటెను, రాజేశ్వరికి కోనసీమ తాతగారంటే ప్రాణము. ఆయన ఎప్పుడును వట్టిచేతులతో రారు. అది కథ.

భోజనము చేయుచుంటిమి లోపల. సంధిలో మాకుక్క గట్టిగా మొఱుగజొచ్చెను. 'రాజేశ్వరీ! అమ్మాయీ!' అని ఆత్రముతో తల్లి బిడ్డను పిలుచుచుండెను. కుక్క రాజేశ్వరిపై బడునేమోయని దానిభయము. కాని మన కుక్క, మనపిల్ల నేమియు చేయదనియు, కుక్క విశ్వాసము నాకు తెలియుటచే భయములేదని రాజ్యమును వారించితిని.

రాజేశ్వరి నవ్వుకొనుచు వచ్చి "నాన్నగారూ! నాన్నగారూ! అని ఒక్కగంట చెప్పనట్లు చెప్పినది. మఱేమోనే-మఱేమోనే, అంటుంది కాని పైముక్క చెప్పదు. రాజ్యము ముఖముపై నెత్తురుచుక్క లేదు. పెద్దపులివలె నేనుండుటచేతను, ఇరువురు పెద్దమనుష్యు లుండుటచేతను నిలిచి యున్నది. లేకపోయినచో కొంచెము కన్నీరు పెట్టెడిదే.

చివరకు రాజేశ్వరి యిట్లు చెప్పినది:

"నాన్నగారూ! బుచ్చిరాజు మామయ్య కాలు విఱుగగొట్టారు పిల్లలు."

ఈభాష నాకు అర్థమయినది. నాభార్యకు అర్థమయినది. రాజ్యమునకు ప్రాణము వచ్చినది. చిఱునవ్వు నవ్వినది. రాజ్యము చిఱునవ్వుతో నాహృదయము వికసించినది. కోనసీమ తాత గారికి అర్థము కాలేదు. అప్పుడు వారికి మనవి చేసితిని. "అయ్యా! నాముద్దు కుక్కకు నా బావమఱది బుచ్చిరాజు పేరుపెట్టితి" నండీ యంటిని. మేము నవ్వుకొంటిమి. తాతగారు రాజేశ్వరి పలుకుపలుకునకు మురియుచుండిరి. భోజనముచేసి లేచితిమి.

రాజేశ్వరి తల్లిని మఱచినది. నన్ను వదలి పెట్టినది. తాతగారితో ముచ్చటలు చెప్పుచున్నది. "తాతగారూ! మీ పల్లెలో మల్లెపువ్వు లెన్ని ఉన్నాయండీ. నా కిస్తారా మీ వూరొస్తాను." తన నాలుగువ్రేళ్లు చూపించి "ఇరవైరూపాయలు పెట్టి కొనిపెట్టాలి" అనెను. ఇదేవిధముగా తాతగారితో మనుమరాలు ప్రసంగించుచుండెడిది.

రాజ్యము లోపలనుండి వీథిలోనికి మాకు పక్కలు వేయుటకు వచ్చినది. నేను వెన్నెలలో పచారుచేయుచు కొబ్బరిచెట్ల గాలికి సంతోషించుచు, రాజేశ్వరి ముద్దుమాటలకు మురియుచుంటిని. చంద్రుడు ప్రకాశించుచున్నాడు.

తాతగారినిచూచి రాజ్యము

"పెదనాన్నగారూ! రాజేశ్వరిని మీ యింటికి తీసికొనివెళ్లండి. దానికి మల్లెపువ్వులు కొనిపెట్టండి. మీఅబ్బాయి కిచ్చి పెళ్లి చేసికోండి. మీయింటనే వుంచుకోండి." అని చిఱునవ్వుతో పలికినది.

రాజేశ్వరికి కోపమువచ్చినది. చివాలున లేచినది. నే నీవింతను జూచుచుంటిని. రాజేశ్వరి యింటిలోనికిపోయి మరలవచ్చి "కోనేటి తాతగారూ! లేవండి. మనవూరికి వెళదాము." అని తాతగారి చేయిపుచ్చుకొని లాగజొచ్చెను. తాతగారు బోసినోరుతో (పండ్లూడినవి గాని ఆరవై యేండ్లు దాటలేదు) కడుపుబ్బ నవ్వి రాజ్యమునుచూచి "అమ్మా చంకలోని దదేమో చూడు. ఓసి! దీని కడు పుడక. పరికిణీ తెచ్చుకొన్నది చూశావా అమ్మాయీ!" అని కడుపు చెక్కలగునట్లు నవ్వెను. సంతోషముగా నారాత్రి గడచెను. ఆరాత్రి అన్నమాట యేమి? ఎప్పుడును మా రాజేశ్వరి మూలమున మేము సంతోషించుచుందుము. రాజేశ్వరి మాయింట ఆనందలక్ష్మి వలె నుదయించినది. పూర్వము ఇద్దఱు, అదని రాజ్యమునేను, మాటపట్టింపులు పట్టుచు తగవులాడుచుండెడివారము. పనిలేకపోవుటచే అట్లు జరుగుచుండెడిది. ఇప్పుడట్టివి అస్తమించినవి.

తాతగారు తమ పనిచూచుకొని రాజేశ్వరికి క్రొత్త చొక్కాకుట్టించి, మిఠాయి పొట్లము చేతికిచ్చి, మల్లెపువ్వులు తెచ్చేదానికి కొంతడబ్బిచ్చి, నిత్యము రాజేశ్వరికి మల్లెపువ్వులిచ్చునట్లు రహస్యముగ నేర్పాటుచేసి, వారు మావూరు వదిలిపెట్టి వెళ్లినారు.

రాజేశ్వరి వెఱ్ఱిమాటలు తగ్గలేదు. పిచ్చిపిల్ల అయిపోవునేమోయనికూడ రాజ్యము భయపడుచుండెడిది. ఆయేటికాయేడు పైబడుచున్నకొలది రాజేశ్వరి అల్లరికూడ ఎక్కువగుచున్నది. నేనింట లేనప్పుడు ఒక్కనిమిష

